బులాడఁగూర్చుచు వైదిక రాజకీయవ్యాపారంబులం దేకాగ్రదృష్టి గల వాఁడై యమాత్యత్వంబు నివర్తించుచుండెను.

## తృతీయాశ్వాసము.

### —బసవనిత్యాగమున కోర్వక తోడిమంత్రులు రాజునకుఁ జెప్పుట—

ఇట్లు రాజసన్మానంబు నొంది బసవేశ్వరుఁడు తనరాచకార్యంబులు యథావిధిగా నెఱవేర్చుకొనుచుండఁగా నొకానొకమాసాంత దివసంబునఁ దనసైన్యములకు వేతనంబులుపంచి యిచ్చుటకు ధనంబు పెట్టెలం దిడికొని శకటంబులపైఁ బెట్టించుకొంచు నేఁగుచుండుట మార్గమధ్యమున నొకవిటజంగమఁ గాంచి యాతనిభక్తవేషంబున వంచించి యొకపెట్టెడు యాంచన్న ధనంబు సర్వంబుఁ దనకిమ్మని యడుగఁ దప్పక యట్లనే యాధనమంతయుఁ నీసి యాతనికిచ్చెను అదిగని తనతోడిమంత్రులు రాజుగారికి చాటని "స్వామీ! చెప్పినపాపము చెప్పకున్నదోషమును సంభవించును గనుక విన్నవించుచున్నారము. బసవన్న మీ రొక్కసమంచిలి ధనమంతయు పెట్టియలకొలఁది భక్తులకు ధారవో యుచున్నవా" డనిరి. అదివిని రాజుమిక్కిలికోపించి బసవేశ్వరులఁ బిలిపించి నీమంత్రిత్వము మాకక్కరలేదు మాధనముమాకిచ్చినీవేగుము నీవు భక్తుండవని పరధనమును లోష్టవత్తుగాభావింతువని మేమునమ్మినచో మాధనమును మాతాతతండ్రులు గణించినయాస్తివలె వ్యయపఱచుచున్నావు. ఇదియేనా నీదైవభక్తి. ఇదియేనా రాజవిశ్వాసము అని యాగ్రహదృష్టితో నడిగెను. బసవేశ్వరులును మందహాసము దరవికసనారవిందుండగుచు "ఓ వెఱ్ఱిప్రభువా! ఇంతమాత్రమునకింత యనుమానము పడవలెనా? నిర్మలశివభక్తుల ధనంబునకాశపడుదురా! ఈశ్వరభక్తుల

నైశ్వర్యంబునకుఁ గొదువయుండదు. కల్పవృక్ష కామధేను చింతామ
ణులు వారలయిండ్ల నెపుడునుగొలువుండును. మానససరోవర నిర్మల
నీరపానంబానర్చు కలహంస మిటికిగుంటలకరుగునా? మందారమాకం
దాదిపుష్పముల మధురసంబుఁగ్రోలు తుమ్మెదయుమ్మెత్తపూవులపై
వ్రాలునా? పరమేశ్వరదత్తమహదైశ్వర్యంబు నందులందూగుభక్తుఁ
డితరధనంబుల కాశపడునా? ఇవిగో తాళపుచెవులు ఈపెట్టెలుదీయించి
యీధనమునుమీరు లెక్కపెట్టుకొనుఁడు అందొకచిల్లిగవ్వయైనఁ గొ
ఱఁత యుండిన నీచేత నేఁగరిచశిక్షకుఁ బాత్రుండఁ గాఁగలను" అని
మృదూక్తులఁ బ్రతివచనంబులఁ బలుకుచు పెట్టియలబీగంబులు దెఱచి
యందున్నధనంబు సర్వంబును లెక్కప్రకార మొకదమ్మిడియైనను
దక్కువలేక గనపర్చెను అప్పుడక్కడనున్నజనంబులు గొందఱు తమ
లోఁదాము పరస్పరాశ్చర్యరససంమగ్న మానసులగుచు నిట్లనిరి తొల్లి
మధురాపురినాథుండు తనప్రధానమంత్రిచే నధికధనంబొసంగి గుఱ్ఱంబులం
గొనుటకుఁగాను దేశాంతరంబుఁ బంపుమండ మధ్యమార్గంబున నొక
భక్తుఁ డాధనంబును గోరదుంటయిచ్చివేసి గుఱ్ఱములనుగొనుటకు
ధనంబులేమి యడవిలోనుతులఁబన్నించి నక్కపోతులం బట్టించితెచ్చి
దక్కనయనారి యనుమంత్రిరాజున కొప్పింప నవియే వేలకువిలువగుఱ్ఱం
బులై పుడమితేనికిం బ్రమోదంబు బుట్టించె భక్తులప్రభావం బిట్లుం
డును మనబసవనమంత్రి రాజుసొమ్ము సరిగాఁగనఁబర్చుట యేమివింత
యని తమలోఁదాము సంభాషించుకొనుచుండ బిజ్జలరాజది విని బసవే
శ్వరుల ప్రభావంబున కాశ్చర్యపడి యాతనినవేకవిధంబుల గౌరవించి
యుపచారంబుచెప్పుకొనియున్న మంత్రులంగని యీమిషదమాబసవన
పై మాతోఁగొండెములంజెప్పు గుండలనాలుకలు గోయించి పొత్త
సున్నంబంటించి నోటిలోదుమ్ముఁ గొట్టింతునని కట్టడము సేసెను.

## జంగమవిటుండొకండు తనలంజకోరికకు బసవేశ్వరుల భార్యగట్టిన పట్టుపుట్టంబడుగుట

మఱియొకనాఁడు జంగమవిటుండొకండు లంజయింటనుండి బసవేశ్వరులనడిగి ధనము తెమ్మని యాలంజ దాసినిఁ బంపెను అదిసని బసవేశ్వరుల నగరికిఁబోయి యట నాతని భార్యయగు గంగమాంబిక గట్టియున్న పట్టుపుట్టముం గని ధనముమాట యటుండనిచ్చి వేగమతిరిగివచ్చి యాలంజను గని "అక్కా! నీకేమని చెప్పుదును. బావగారువన్ను బసవేశ్వరులనడిగి మన కర్చువెచ్చములకు ధనముఁదెమ్మని యంపినారు బసవేశ్వరులనగరికి నేనేగి సూచునంతటిలో నాతని భార్యయగు గంగమదేవి గట్టియున్న పట్టుపుట్టము నాకనులకు మిఱుమిట్లు గలుగంజేసినది. ఏమియాచీరెయందము ఏమిదానినిగనిగలు ఏమి దానిజరీయంచు ఏమిదానిమార్దవంబు ఇఁక నేనేమనేఁ జెప్పలేను ఆచీరెవంటి చీరెయీ భూలోకంబున నేగాము ఏలోకంబున నేనాఁటిమఱియెద్దను లేదని నేను దృఢముగా నొక్కి వక్కాణింపఁగలను బావగారిని బంపి యాచీరెఁ దెప్పించి నీవు ధరించితివేని నీజన్మ సార్థకంబగును. అట్టిచీర ధరింపని యాడుజన్మంబేల? అని దాసిచెప్పిన మాటలువిని యాపసుపుంబోఁటి తనవిటునిం డాసి "ప్రియుఁడా! బసవమంత్రిభార్య గంగమదేవి గట్టిన పట్టుపుట్టము నీవు దెచ్చి నాకియ్యవలెనే. లేనిచో నేటితో నీస్నేహము నాకక్కఱలే" దనియెను విటులు కామాంధులు గదా లంజకోరినఁ దనమానప్రాణములైన నీయ సిద్ధపడుదురు సిగ్గన్నమాట మొదలేయుండదు. లంజకోరిక దీర్చుటకు జంగమవిటుండు మైనిండ భూతినలఁది రుద్రాక్షమాలలుధరించి రుద్రాక్షకిరీటంబు తలపై నిడి రుద్రాక్షాంగదంబులు రుద్రాక్షకటకంబులు రుద్రాక్షాంగుళీయకములు రుద్రాక్షపావలు రుద్రాక్షఛత్రంబును ధరియించి యడుగడుగున "శంభో, శంకర, మహాదేవ, సాంబ, సదాశివ" మొదలగు శివనామోచ్చారణంబు సేయుచుఁ బ్రత్య

కురుద్రునివలె వేషమున్నై మఱొని బసవేశ్వరుల దివ్యభవనంబున కరిగి శివపూజానిష్ఠా సమయంబగుటఁ దానును లోనికరిగి బసవేశ్వరులచే నతిథిసత్కారంబులంగొని "బసవనమంత్రీ! నీకడ కొకముఖ్యమగు పని గలిఁగి నేవచ్చితి. నాకు ధనధాన్యంబు లక్కఱలేదు భోజనభాజనంబులును పనిలేదు. నీయుంగనధరించు దుకూలవుట్టంబు నాకొసంగి యతిశీఘ్రంబున నన్నంపెతివేని నీకుఁ బదిపున్నెంబులఫలంబు గలుఁగును" అని యింకయుఁ జెప్పఁబోవుచున్న జంగమవిటుని బసవేశ్వరులు మాఱి చెప్పనవసరములేదని తనభార్యను రావించి "చెలీ! నేఁడు మనభాగ్యమేమని కొనయాడుదును. పుట్టువెలుఁగని యీజంగమ పుట్టువేల్పు సాక్షాద్భరుద్రుఁడు. మనగృహపావనంబు సేయ నేతెంచి మనల జన్మలుసార్థకంబగునట్టుల నీకట్టినపుట్టం బభ్యర్థించుచున్నవాఁడు ఇప్పుడీతని కిదిస

**బసవేశ్వరులు తనభార్య కట్టినపుట్టము తానుస్వయం విప్పి జంగమున కిచ్చుట.**

మర్పించితిమేని మనకు మఱి పుట్టువుండదు కాన నామాటఁ ద్రోసివేయక వైళి బయాపుట్టం బిచ్చివేయుమని తానామెపైటచెంగు పట్టి చీరెలాగుచో మఱల నెప్పటియట్ల నాపైటచెంగట్లమఱియుండెను చీరెయంతయు దేహమునుండి తొలఁగించునంతలో మఱియుఁ జీరెయు నమరియుండె. ఇట్లు బసవేశ్వరులామె కట్టినపుట్టంబు గట్టినది కట్టినట్లుండఁగా ననేకచీరెలామె శరీరమునుండి యొలిచ యచ్చట నేలపైనొకరాశిగా చీరెలుపడ్డైచెను. అదిచూచి జంగమవిటుండు సిగ్గుపడి "ఏమి యీబసవనప్రభావము ఈయన తీసినకొలఁది చీరెల క్షయంబులగుచున్నవి. అయిన నిదియొక వింతగాదు శివభక్తులకివి సామాన్యకృత్యంబులే. తొల్లియిడుగుఱి నాయనారి తనభార్య చీరలిట్లే యొలిచి యిచ్చియుండలేదా? బల్లహుఁడు తనభార్య నీయలేదా? ఇంక మఱెందఱెన్ని యీయలేదు. అన్నిటికన్న చిత్రమైనది మఱియొకటి మానకంజారుఁడు

తనకూఁతుపెండ్లి మహావైభవముతోఁ జేయుచుండ నొకబక్కరి తపసి వచ్చి యాపెండ్లికూఁతురి శిరోజములఁ దనకు జడలుగా ధరించుటకు నిమ్మనియడుగ నాయన యెంతమాత్రము మనంబునఁ గొత్తపెండ్లి కూఁతురను శంకలేక యావెండ్రుకలు గత్తిరించియివ్వలేదా? శివభక్తులు దమప్రాణములైనను గొంకులేక యడిగినతక్షణము సమర్పింతురు గావున బసవనమంత్రి యీచీరెలొసఁగుట యొక యాశ్చర్యంబుగా" దని తనమనంబున ననుకొని నాప్రియురాలు నేనిచట జాగుసేసినందుకు మనంబునఁగినియునేమో యిఁకనిటఁ దడయరాదు వలసినన్ని చీరె తెత్తికొనిపోయెదనని తనవత్తిమీఁద నొకచీరెలమూటఁ బెట్టుకొని మనలిక త్వరగ మనంబున వెలయాలి యిల్లుఁజేరెను అంత నక్కడిజనులందఱు బసవేశ్వరుని యుదారభావంబునకును సిద్ధాంగనాంగీకారంబునకు నతులాశ్చర్యానందంబుల నొందుచుండ నింగిమాఁపక యంతఃపురంబునకుం జనియె.

(సంధ్యాకాల శివపూజ)

అంత దినకరుఁడు పగలంతయుఁ బసవేశ్వరులు సేయుచున్న దానగరిమనుఁ జూచుచుండి కరయుగంబున నాతఁడు సేయుచున్న దానమునకు సహస్రకిరంబులఁ దాఁజేసెడిదానము సరిరాదని నాతనిప్రతాపంబున కోడిపాఱెనో యన్నటుల సూర్యాస్తమానంబయ్యె తనయింటికతిథిగా నేతెంచుచున్న సూర్యభగవానుల కహఃపూజలుగావించుటకు నపరదిగ్వధూమణి లక్షపుష్పపూజకునై సేకరించిన కెందామరల రాశియనఁ బడమటిదిక్కున సంధ్యారాగమతిశయిలెను అట్టి సంధ్యారాగసమయంబున శివార్చనలు శివభక్తులు సేయుచున్న సమయంబున బసవనమంత్రియుఁ దనశివపూజ కుద్యుక్తుఁడై యొగునవసరంబునఁ గొందఱు తృతీయపురుషార్థపరులగు జంగమవిటులు దమశివపూజలు తమతమభోగవనితల యిండ్ల దీర్చుకొనువారై మలయగంధకుసుమాది పరి

కరములు బసవననడిగి తీసుకొని తదనుమతి నడుచుచుండిరి. ఇట్లువిరు
లగు జంగమును వేశ్యలయిండ్లకుఁ జనుటగని, ముగ్ధసంగయయను

## ముగ్ధసంగయకథ

నొకభక్తుఁడు కేవలలింగపరాయత్తచిత్తుఁడు ప్రథమ పురుషార్థపరుండు
లింగశబ్దము తత్సంబంధసేవాపూజావిషయక పరిభాషతప్ప తదితర శబ్దా
ర్థమైన నెఱుంగనివాఁడు తనమనంబున నిట్లువితర్కించుకొనెను. పంపె
డువాఁడుబసవనమంత్రి వెళ్లెడువారు మహాదేవభక్తులు కొనిపోఁడుగొని
పోవుచున్నవి శివపూజాద్రవ్యసంభారములు. ఈభక్తులందఱు శివపూజ
లొనర్చుకొను స్థలము లంజలయిండ్లట ఒక్కొక్కభక్తునికొక్క లంజ
యిల్లు విడిదిగా నేర్పఱుపఁబడెను వీరందఱచ్చటికి శివపూజార్థముపోవుచు
న్నవారు లంజలయిండ్లశివపూజలు బహువిఘ్నతో నిశ్చలత్వముతో నే
ప్రతిబంధకములు లేక జరుగునేమో? నేనునుబసవనమంత్రి నడిగిరయొక
లంజయిల్లు విడిదిగానడిగి యచటకేఁగినిశ్చలముగా శివపూజసేసికొని
యెదనని లంజయన్న నేమోయెఱుఁగని యామహానుభావుఁడు బసవ
దండనాథునికడకేఁగి తనకును వలయుసంభారములతో శివపూజకై
యొకలంజయిల్లు విడిదిగానియమింపుమనివేఁడెను ఈతనియమాయకత్వ
మునకు మౌగ్ధ్యభావమునకు బసవేశ్వరులవారు మందహాసముసేసి తగిన
సాధనసామగ్రిసంభారములతో నొకయతిచతురురాలగు మనోహ
రాంగియను నగువేశ్యయింటికిఁ దోడిచ్చిపంపిరి ఆవేశ్యయునిట్టిపరమభక్తా
గ్రేసరుఁడు తనయింటికివచ్చుచున్నవాఁడని ముందుగానెఱిఁగినదికావునఁ
దనగృహంబునకు ననేకశృంగారములుగావించి పచ్చనితోరణములు గ
ట్టించి కస్తూరికలపినసీటఁ గలయంపిచల్లించి ముత్యాలముగ్గులు వెట్టిం
చి శయనగృహంబ లంకరించి బొమ్మలుపటములువెట్టించి మణిదీపముం
చి పందిరిమంచమందు పట్టుపరుపునుబఱిపించి దానికిఁజుట్టునుం బూల
దండలు వ్రేలించి తలగడలుదిండ్లువెట్టించి వాసనద్రవ్యంబులు సిద్ధపఱ

చి లోనికిఁ గాలుపెట్టడముతోఁ గామోద్రేకంబుగలుగునటులసేయించి తానును బన్నీటజలకమాడి పసుపుమేనలఁదికొని కుంకుమచందనంబుల నుం బూసికొని కస్తూరితిలకంబిడి దివ్యవస్త్రదివ్యాభరణంబుల ధరించి వేచియుండి తనగృహసమీపమునకు ముగ్ధసంగయ్యరాఁగానే యెదురుగాఁ బోయి యడుగులకెఱఁగి కైదండయొసఁగి యర్ఘ్యపాద్యంబులచే హస్తపాదప్రక్షాళనంబులు సేయించి యాతండుగొనివచ్చిన నౌకర్లచేతి పూజాద్రవ్యంబులం దనదాసిచేలోనికంపి శయ్యాగృహంబున కాతనిఁ జేర్చునంతలో నాతండదిగని వెఱఁగందియది పరమేశ్వరునాస్థానమని యామంచంబు హరునాస్థానమంటపంబని యెంచి శివపూజకు నిది సరియగు స్థలమని మనోల్లాసంబుగఁగుర నచ్చోఁదన ంబళి విప్పిపరచి కూర్చుండి శివపూజకుఁ దాఁదెచ్చిన సంభారముల నందుకొని యవ్వోనుంచుకొని విభూతి మేన ధరించుచు వేశ్యనుపై

ముగ్ధసంగయ వేశ్యాశయనగృహములో శివపూజ సేయుట.

తమోభస్తనిఁగా భాషించి స్త్రీపురుషవిచక్షణత నెఱుంగని యా మహానుభావుండు నీవేలభూతి మేనఁ బూయుదువని యడుగ నామె “స్వామీ! నామేనఁ బచ్చనిబూదిబూసితి యిదియే పార్వతిధరించు విభూతియని దా రాసుకొని పసుపుఁజూపెను. రుద్రాక్షమాలలుదీసి తనమెడలోఁ వైచుకొని నీవేలరుద్రాక్షలు ధరింపవని యామెనడుగ నాముగ్ధయు నతిచతురగా వున స్వామీ! యివిగో నామెడలోని రుద్రాక్షలు” అని మౌక్తికహా రంబులు గనపర్చి “స్వామీ! రుద్రాక్షలు లవణసముద్రప్రాంతములం దుప్పునీటిచే వృద్ధియగు రుద్రాక్షచెట్లయం దుత్పన్నంబు లగుటవలన మీవినల్లగానుండును మావిదుగ్ధసాగర మధ్యంబునం బడియుండి సర్వదా పాలతోఁదడియుచు దానియడుగున నిసుకలోఁ గూరుకొనియుండు శుక్తిరుద్రాక్షతలంబులలోని గింజలగుటచే మారుద్రాక్షలు తెల్లగానుండు” నని తనహారములు చూపించెను ఇట్లు సంగయ సేయు ప్రశ్నలకెల్ల

తానుమారుత్తరంబు లిచ్చుచు నతని మనసున కెక్కునటులఁ దన యా ర్యామతంబును బోధింపనదియు నొకశివమతంబని యాతఁడనుకొని "భక్తాగ్రేసరుఁడా! నీమతంబు బహుచిత్రమైనమతము ఈమతమునకు గురువులెవ్వ" రనిన నాతలోదరి స్త్రీపురుషభేదములేక తన్ను భక్తుఁడా యని పురుషవాచకంబున సంబుద్ధిసేయునాతనికిఁ దద్భేదంబుఁ దెలుపు నదై యిట్లనియె "స్వామీ! మీది శివమతము. మాది పార్వతిమతము మామతమున కాదిగురుఁడు సదాశివుఁడే ఆతనివలన పార్వతి యుపదేశ మునుబొందియామె మాకెల్లర కుపదేశించెను కాన మేము పార్వతీ మతస్థులము వర్వతియన శివునిభార్య శివుఁడు పురుషవ్యక్తి పార్వతి స్త్రీవ్యక్తి లోకములోని భక్తులందఱు వారిస్వరూపులు మీవంటిపురు షులందఱు శివస్వరూపులు. నావంటి స్త్రీలందఱు పార్వతీస్వరూపులు శివ పార్వతులిద్దఱు నేకాంగులు అట్లనే భక్తపురుషులు, భక్తవనితలు నే కాంగులు. అట్లనే భక్తస్త్రీపురుషు లాదిఱు నేకాంగులే బసవనమంత్రి మొదలగు మహాపురుష భక్తులందఱుఁ దమతమ కొక్కొక్కయర్ధాంగిఁ గలిగియుండురు. వానితోవారు సమస్తసుఖంబు లనుభవించుచుందురు ఇఁక మీవంటి ప్రత్యేకస్త్రీలులేని భక్తులకు మేము స్త్రీలుగా నర్ధాంగ మలంకరించు స్త్రీభక్తులము మీరు నేను నేకాంగులమై చరింపవలెను కాన వినుము. ఈరాత్రి సమస్తభోగము లంగీకరించి నామాట యంగీ కరించి మీరునాతో నేకాంగత్వమున నీరాత్రి సుఖింపవలెనని కోరుచు న్నా ననెను. అదివిని యట్లనే సేతము. ముందుమన శివపూజ కానిమ్ము పిమ్మట నీచెప్పినయట్లు చూతము" అని తనశివపూజ పెట్టియఁ దెమ్మ న నామె శివపూజ నామూనందిచ్చి తనదాసీజనంబుల నాటపాటలకె సిద్ధపఱచి శివపూజా సమయమందుఁ దానును వినోదంబు జరుపుచుం డెను. ఇఁక శివతన్మయత్వంబున నాతఁడు శివపూజ ముగించునం తటితోఁ దెల్లవాఱెను సూర్యోదయం బయ్యెను. బసవేశ్వరుల

## ముగ్ధసంగయ్య బసవేశ్వరులతోఁ దాను చేసిన శివపూజా విధానము సెప్పుట

త్యాగశీలత్వమును దార సాహసంబులకు వెఱఁగంది సిగ్గుపడి పాఱిపోయి నయుఁ గ్ర్యాఁడు మఱలఁ జూచుచు కుతూహలంబున వచ్చినాఁ డాయనను నటుల సూర్యుఁడుదయించెను అప్పుడు ముగ్ధసంగయ్య బసవనమాత్రి గృహంబునకే తెంచి తనకన్నముందువచ్చి కాచియున్న విటభక్తులందఱు వినుచుండ తనచేసినపూజావిధానం బిట్లని సెప్పఁదొడగెను "అయ్యా! బసవేశ్వరులవారూ! నేను గడచినరాత్రి శివపూజయందు బహుబాగుగా నెఱవేర్చితిని ఆలంజయు నాకన్న నధికభక్తుఁడువలె నన్నుఁ గారవించెను మీరుగూడ నాతోవచ్చియున్న యెడల నావినోదంబునకు మీరునానందించియుందురు నాలోకకర్తృత్వసంగతి తెలిపినవి పార్వతిభక్తులు స్త్రీలట. శివభక్తులు పురుషులట పార్వతిశివుఁడు నెల్లు సర్వదాయేకాంగులై యుందురుగా! యట్లనే స్త్రీభక్తులు పురుషభక్తు లేకాంగులై యుండవలెనట శివునికిఁ బార్వతియున్నట్టుల మానవాతిభక్తులకొక్కొక్క స్త్రీభక్తురాలేర్పడియుండునట. ఇట్టి మానవాతిస్త్రీలు శివభక్తులకొఱకుఁ దామేర్పడిరట స్త్రీపురుషవాచకముల భేదములు తెలిపినవి స్త్రీలు ధరించునది పచ్చవిభూతి తెల్లరుద్రాక్షలునట వారుమున్నునఁ గూడ రుద్రాక్షధరింతురట అవి పెద్దదియై తెల్లవాటిజామునఁ దూర్పుదిక్కునఁ గనఁబడు వేగుజుక్కవలెనుండును. ఇంకయునెన్నోన్నో ఆభక్తుఁడు—కాదు భక్తురాలు—నాకుపదేశించెను తనయొద్దనున్న భక్తబృందమును బిలిచి నాశివపూజాకాలమందు గానవాదామోదంబు గలిగించెను. శివునిమోహాలనామనాదం బనియొకదా స్త్రీపురుషభక్త లేకాంగులు కావడమె శివానందమట ఆయేకాంగత్వము రాత్రులయందేగాని పగలులేవట పగటిపూట భిన్నాంగులుగానేయుందురట ఈయేకాంగత్వ విషయము నాకంతగా బోధపడలేదు. కాని స్త్రీపురుషభేదముమాత్రము

తెలిసినది. పార్వతీపరమేశ్వరులు సమర్థులు గనుక వారలేకాంగత్వమును జరింపఁగలరు. మనము మనుష్యులగుటచే నట మన కేకాంగత్వము రాత్రులయందేగాని సర్వదా లేదట ఇంకయును నేకరహస్యములు నేటి రాత్రి శివపూజాసమయమున నుపదేశింతునని యామెచెప్పెను,'' అని సంగయ్య చెప్పుచున్నతటి వినువారందఱు నొకరితోనొకరు రెకసక్కెములాడుకొనుచు కడుపులు చేతఁ బట్టుకొని యాతని యమాయకత్వమునకు నవ్వుచుండిరి. బసవేశ్వరులవారు మందహాసము సేయుచు నాతనికిఁ గొన్ని హితమార్గములు బోధించి యుచితసత్కారములు సేసి పంపెను

చెన్నబసవన్న బసవేశ్వరులతో నిట్టిభక్తులఁ గూర్చి ప్రసంగించుట

అప్పుడు సమీపమునను న్న బసవేశ్వరులువారి మేనల్లుడు చెన్నబసవన్న యాముగ్ధసంగయ్య మూఢభక్తికి నాశ్చర్యపడుచు నిట్టియీమూఢభక్తులు తొల్లి యెందునైనసునుండిరా? ఇప్పుడున్నారా? ఇకముందు నుంగలరా? యని తనకుఁ దోఁచినగు బసవేశ్వరులవారినడుగ వారు మునుపున్న భక్తులచర్యలు గొన్ని వానికిట్లు వివరించి యిట్లనిరి

బసవేశ్వరులవారు చెన్నబసవనికి మూఢభక్తుల వృత్తాంతంబు చెప్పుట

ఓయి చెన్నబసవన్నా! మూఢభక్తిమాహాత్మ్యము ఈ తంతు మనము పురాణములలో వినియెడి తొల్లింటి ఋష్యశృంగునివంటి వాఁడు ఆతండును స్త్రీలనుసైతము మునులుగానె భావించుచుండెడి వాఁడు. విభాండకుండను మునికి నొకయప్సరస దర్శనంబున రేతస్ఖలనంబయిన నాతండు రేతంబుతోఁదడిసిన కౌపీనంబు నొకసరోవరంబునఁ బ్రక్షాళనంబు సేయు నొ యేఁడు లేడి తృషార్తయైవచ్చి యాసీరు ద్రావినఁ దానికి సద్యోగర్భంబున మృగచిహ్నంబుతో నొసలనొక శృంగంబుగల సుతుండుదయించిన నాముని యాబాలుని నాశ్రమంబునకుం

గొంపోయి పెంచెను. ఆతఁడె ఋష్యశృంగుఁడు తుదకాతండు వేశ్యల వలన నాలోకజ్ఞానమును బొంది స్త్రీపురుషభేదము నెఱింగి తుదకు మహానుభావుండయ్యెను

పూర్వకాలమునందు రుద్రపశుపతియను నొకభక్తుఁడు తనయింటిలో నొకపౌరాణికుఁడు భాగవతంబు పురాణంబు సదువుచు క్షీరసాగరమథన కథాప్రసంగమున నయ్యవసరమునందు హాలాహలమును జగన్నాశనకృత్కరాట్టహాసంబు నొందు విషము బయలువెడలిన దాని బ్రహ్మాదిస్థావరులు కోరినమీదట శర్వుండు మ్రింగెనని విని యాపౌరాణికుని మఱలమఱల నాథయే యడిగెను "ఏమీ లోకాంతకరంబగు విషమును శివుఁడు మ్రింగెనా? ఇది నిజమేనా?" యని గ్రుచ్చిగ్రుచ్చి యడుగుటయు నప్పౌరాణికుండది నిజంబని చెప్ప నాభక్తుఁడు నేలబడి కొంతవడికిఁ జైతన్యమునప్పి ఏమ్మాట వెలువరింగానే "నాతండ్రీ! శివ్వన్న నీవు విషమేలమ్రింగితివి నీవు మ్రింగితివన్న నేనుయున్నకు వచ్చినపుడు నిజముగా మ్రింగిన నీవే యవస్థ నొందుంటివో కదా రొమ్మున గట్టినమొదల నదె చంపుదు కాన నాతండ్రీ వేగమ గ్రక్కివేయుము. క్రక్కకున్న నీకు మరణంబు సంభవించును ఆదుర్వార్త నేను వినఁగలనా? అయ్యో! విషము మ్రింగుమని నిన్ను కోరుటకు వారలకు నోరెట్లాడె? వారే మ్రింగఁగూడదా? తామే యాపదయు లేక సుఖముగా నుండవలెనట నీవు విషము త్రాగి చనిపోవలెనట ఏమి వీరిగడుసుతనము నీకుఁదల్లియున్న నట్లుమ్రింగనిచ్చునా? నీయర్థాంగమున నున్నయగజ యెట్లొప్పుకొనియె వీరభద్రాది సుతత్రయము బెదరనియె వారున్నఁ ద్రాఁగనిత్తురా? ఇఁకనైన వేగమ గ్రక్కుము నాతండ్రి, నేభరింప లేకున్నాను ఈవార్త నాగుండె బ్రద్దలుకొట్టుచున్నది. నేనేమిసేతును ఎంతదుర్వార్త వింటిని విషము గ్రక్కివేసితివా లేదా? పౌరాణికుండా! ఆవిషము గ్రక్కివేసెనా లేదా? నిజము సెప్పు" మని పలువిధంబుల పలవించుచున్న

యూరుద్రపశుపతికిఁ బౌరాణికుండింక యుమియ నులేదు. కంఠమున నున్న దని చెప్పెను అదివిని ,,అయ్యో! కంఠగతమైన దేవివిషము ఇకనాకేది దిక్కు ఆవిషము కంఠము దిగిన యెడల నుతిచెప్పునదేమి? ఆపయిని మరణవార్తయే ఇకనేఁ బౌరాణికునడిగిన నావార్తయే చెప్పెను ఇక నేను మఱెవ్వరినడుగక మరణవార్త చెవులఁ బడకమున్న నేనేమరణాం బునొందెద నని యవ్వోనన్న యొకయగాధసరోవరంబులంగని యం దుదుముక మునుంగించునవసరమున ప్రమథగణంబులతోడను గంగాజటా జూటంబులతోడను శాలేయ శిరశిఖాభూషణముతోడను వాసుకినామ కసర్పరూప పాశంబుతోడను నాగయజ్ఞోపవీతంబుతోడను దుర్గాస మాకాన్తవామార్ధదేహంబుతోడను సూర్యశశాంకవహ్ని నేత్రంబు లతోడను పరమేశ్వరుండు ప్రత్యక్షమై ,,భక్తునకుఁడా! నీమహాభక్తి కి నేమెచ్చినాఁడ నీకుపలయు వరముగోరు" మనవుఁడు భక్తుఁడు "స్వా మీ! నావరంబుమాట దైవంబెఱుంగు నీవువిషము నుమిసితివా లేదా? ఆమాట ముందునాకు జెప్పుము అపైనావరముమాట చూచు కొందును" అనునంతలో నీశ్వరుండు వానినోదార్చి ,,నేను విషము గ డుపులోనికి మ్రింగలేదు గరళంబును నిముడ్చుకొన్నవాఁడను. గానినేగ దా భక్తులనన్ను నీలకంఠుడందురు ఈవిషంబిట్లుండుట నాశరీరంబు నకు నూఱేమియు రానేరదు. నేను యథాయోగ్యముగా నున్నవాఁడను" అనునంతలో భక్తుఁడు విషమెప్పటికైనను ప్రాణహాని జేయును గనుక నాతండ్రీ! వేగమ యుమిసినైవుము కంఠములో నెల్లకాలముండు నా? కంఠము దిగినయెడలఁ దప్పక ముప్పుదెచ్చును అదిగో దిగుచు న్నట్టు నాకగుపడుచున్నది అని యాపరమేశ్వరుని కంఠముదిక్కునను రెరేకదృష్టితోఁ జూచుచున్న భక్తునిఁ దగతోడవైఁ గూర్చుండఁబెట్టు కొని" ఈవిషమెప్పుడు నిట్లనేయుండును క్రిందికిదిగదు నీవునమ్మవేని నమ్మకముపుట్టువఱకు నట్లనేచూచుచుండు" మని శంభుఁడనునంతలో

భక్తుఁడు "నేనిట్లనె మాచుచుందును ఈవిషము కంఠమెప్పుడు దిగితే యప్పుడు నాశరీరంబు విడుతు" నని చూచుచుండెను ఇప్పటికి రుద్రపశుపతి యీశ్వరునికొఱకై నిరీక్షించి కూర్చొనియున్నాఁడు. వింటివా చెన్నబసవా మూఢభక్తుల చర్యలని బసవేశ్వరులు చెప్పి మఱియు నిట్లనియె

## నక్కనయనారికథ

నక్కనయనారియను నొకభక్తుఁడు తనభార్యయుఁ దానునొక శివపూజసేయుసమయమున నొకలింగమూర్తిని వారు వామకరంబున నుంచుకొని ధ్యానావాహనాదిషోడశోపచారంబులఁ బూజించుచుండిరి. భర్తనిగులనీషుగా శివపూజ సేయుచుండెను భార్యతనలింగమూర్తి నకచేతనుంచుకొని యేకాగ్రచిత్తంబునఁ దిలకించుచుటె నాలింగమూర్తి తనువుపైని జలజలమని చలిదిపరికినట్లగపడెను అదిగని యారోగిము దేహమంతయు వ్యాపించెనని శరీరమునకు హానివచ్చునని దానికిఁ జేయవలసిన ప్రతిక్రియ యామెచేసెను. ఆచలిదిరోగమునకుఁ జేయవలసిన శాంతి యేమనఁగ నిగనపడిన చోటనే యాతనువుపై నారోగమంకురించిన భాగమునఁ దన్నుమయుమిసి యూదిశాపముటగను నానయనారిభార్య యట్లనే తొందరపడి యారోగనివారణముఁ గావించెను. ఆయుమియుటలో నామెనోటి తుంపురలు పక్కనను శివపూజసేయుచున్న భర్తచేతిలో నున్నలింగమూర్తిపై కొన్నితిటులునఁబడెను అదిగని యామెమగఁడు మిగులఁగోపించి "యోసీపాపీ, నీకుభక్తియనువాసన యేలేదు. మూఢురాలవు కూడు నాలింగమూర్తిపైన నోటితుంపర లెట్లుపడినవో. నీనుంచినాశివపూజ భ్రష్టయుపోయినది ఇఁక నిన్ను నేనొల్లను నీయిచ్చవచ్చినచోటికిఁబొమ్మ్న" అని ప్రియురాలి నెటకేని వెళ్లఁబుచ్చి తానుశివపూజయెటులనో ముగించి మఱునాఁడు పగలంతయు నేకాకిగాఁ గాలయాపనము సేసి రాత్రిశివపూజకై లింగమూర్తిని బైటఁ దీసి చేతిలోనిడుకొని చూచుచుండిలోఁ దొలిరాత్రి తనభార్య

నెంతవఱకు దూపాడిచెనో యంత మేరదప్పఁ దక్కినలింగమూర్తి దేహమంతయు నెత్తురుపొక్కులతో చలిదిరోగముచే నిమ్మెయల్లలనాడుచుండెను. అదిగని యావయనారి తానుభార్యను దత్తముచేసిన దోషమునకు బశ్చాత్తాపమునొంది భార్యయొక్క భక్తికిమెచ్చుకొని యామెనువెదకి తెచ్చి మనోహరాంగీ, నీభక్తినినేఁగనుఁగొనవేర నైతిని నాలింగమూర్తినిఁ జూడుము. నీపురగతరాత్రి దూపాడిన మేరదప్ప తక్కిన మేనంతయు నెట్లురోగపూరితమైనదో" అనియామెకు సాష్టాంగనమస్కారము చేసి యీవ్యాధి నివారణసేయుమని కోరుటయు నామె దేవుని మేనపొక్కులుకనిపెట్టి అయ్యో! నిన్న నామగఁడు నన్నుకోపపడి పొమ్మన్ననుఁ బోక మొండితనముఁ జూపి నేను స్వామిశరీరము తయు నప్పుడె దూపాడిచినయెడల నింతజబ్బుముదరకుండును ఇప్పుడు దేహమంతయు వ్యాపించె నే నెట్లు బాగుసేయఁగలను దేవునియొడలు పడిపోకము దేనాయంగమునేను విడిచెదనని తనువుఁదోరగఁ బ్రయత్నించు నామెకు శివుండు సాక్షాత్కరించి "అమ్మా! నీభక్తికినే మెచ్చితి మీభార్యాభర్తలిద్దరికి వలయువరంబులుఁ గోరుఁడిచ్చెద'నని యడిగెను అంతకు వారు "దేవా! నీదివ్యదర్శనంబయ్యెను. ఇంకమాకుఁగోరవలసిన వరము లెవ్వియో మాకుఁదెలియవనిరి అందుపైని భగవంతుడు వారియమాయకృత్యమునకు సంతసించి వారలకు భూలోకమున నున్నంతకాలము సకలైశ్వర్యములతోఁ దులఁదూఁగుచుఁడు నుండునటుల కైలాసంబున కేఁగి తననారూప్యముక్తినిఁ బొందులాగునను వరంబులిచ్చి యంతర్ధానమయ్యెను

## బిజ్జమహాదేవమ్మ కథ

మఱియు బిజ్జమహాదేవమ్మ యనునొక పెద్ద యతివ శివార్చనాపరతంత్రురాలై యొక్కనాఁడు తనమనంబున నిట్లని వితర్కించె "శివునికిభార్యయుండి, తదెతరపరిచరులుండఁబుండి, యొక్కతల్లి లేకపోవు

టకుం గతంబెయ్యది యగునో, తల్లిలేక యితండెట్లు పుట్టి యుండును. లోకములో సకలజీవులు జన్మించుటకుం దల్లియేగదా మూలకారణంబు అట్టి తల్లివలన నేఋతంకును బుట్టియుండనోపును తల్లి యున్న నీతనికిన్ని పాలువచ్చునా? తల్లి యున్న నీతనినెట్లు తిరిపమెత్తనిచ్చునా తానయి నం బదియుండ్ల వడిగి తెచ్చిబిడ్డనిసాకునుగాని యిట్లు పేక్షించునా. తల్లి యున్న నితనినిట్లుకోలుదాల్పనిచ్చునా? విసముత్రాగనిచ్చునా వల్లకాటిలోం దనబిడ్డఁడుండి బూదిబె బూసికొనుచుండ నేతల్లిచూచి భరింపం గలదు. ఇతనికిం దొల్లియొకతల్లి యుండి గతించి యుండవచ్చును. అయ్యో, లోకములో నిందఱుస్త్రీలు, బిడ్డతెల్లులున్నారు ఎవరైనను తమబిడ్డఁడని శివుని గాపించి యుత్సవములు సేయుటే కాపాడుచుండఁగూడదా కానినేనొక నీశ్వరుని నాబిడ్డఁడుగా భావించుకొని సకలవిధంబుల నాతని కంగరక్షసేయుచుండును" అని నిశ్చయించుకొని యప్పుడు జనించిన నెలపరిమాణముగల యొకశివలింగమునెత్తి వెచ్చ యిద్దానినుకొని నాయనా, నీవునాబిడ్డఁడవు. నిన్నునే నిప్పుడుగంటిని. ఇదిగో నేటినుంచి నీకు బాలకోపచారంబులు సల్పి నిన్నుం బెంచి పెద్దవానినిం జేసెదను." అని నూనె మేనంబూసి నలుగిడి యుష్ణోదకింబులమీఁదం జలికినోటిలో నీరునడకుండం జేయియడ్డపెట్టి నీరుగ్రుక్కుతుంచి కడుపనిమి యొడలు దోమి మజలమజల నీరుపోసి జలకమాడించి తడియొత్తి పొత్తిళ్ళవెట్టి యుయ్యెలబరుండబెట్టి లాలిపాటలుపాడి నిద్రపుచ్చి మఱుమేలుకొలుపాడి లేపిపాలిచ్చి మజలంబరుండబెట్టి యిట్లు దినదినము శైశవకర్తవ్యములగు నుపచారంబులు సేయుచుండును నేలంబ్రాకుటీమున నా తండ్రి, ప్రాకుచుంటివాయని లేవనెత్తి యక్కునదుముకొని మోకాళ్ళను చేతులవంటిన మన్నుం దుడిచి చేయూతనిచ్చి నడిపించును. విద్దెములు సేయించును నడిపించును పరుగెత్తించును. చిన్నచిన్నమాటలను నేర్పును పెండ్లిసేసెదనని యోదార్చుచుండును

అయిదుసంవత్సరములయీడు బాలుఁడగునంతకు నాశూలియు నవ్వ యందలివాత్సల్యంబున నామె సేయు నుపచారంబులు గైకొనుచు నిజమైనబాలునిక్రియ నామె ముచ్చటలు దీర్చుచుండెను. ఇట్లుండి యొకా నొకనాఁడు భగవంతుఁడు ముసలవ్వకు మోక్షమిచ్చుటకు నుద్దేశించుకొని యేదైన నొకమిషగల్పించి యామెకుఁ బ్రత్యక్షము గాఁదలంచి మిగులరోగపీడితునివలె నోరు తెఱవక కండ్లుమూసి తల్లియొద్దఁ బాలు ద్రాగుచు నోటనున్న కుచచూచుకము మెల్లనవదలి యూరకపరుండెను అదిచూచి యాయవ్వ "అయ్యో! నాతండ్రీ! నీకెక్కడరోగము వచ్చినది నీరోగము నాకై వచ్చినదికాదు నేఁబోయి నీవున్నలోకమున కెంత మేలుగలుగునోగదా నాచిన్నికుమారా! నిన్ను విడిచి నేనెట్లు బ్రతుకఁగలను నాతో మాటలాడవేమి కన్నువిప్పిజూడవేమి. ఇది యేమిజబ్బో తెలియదు ఏవైద్యునికి జూపుదును ఒడలుచల్లగానేయున్నది నాడి బాగుగానే కొట్టుకొనుచున్నది. చేయిబట్టి చూచినయెడల జబ్బేమియు గనపడదు పిల్లవాఁడు మాత్రము గడియకో క్షణమో యూపిరి విడుచువానివలెఁ గనిపించుచున్నాఁడు. ఇదియేమి మాయరోగమో తెలియదు నేనేమిసేయుదును నాకేదిదిక్కు ఎటుబోదును. నాయనా మాటాడవేమి నాబిడ్డా, నీకొకయిక్కట్టు వాటిల్లిన నాగతియేమికాను. తండ్రీ! ఒక్కసారి నీముద్దుమాటలు నాచెవినిఁ బడనిమ్ము కన్నువిప్పుము ఈయూపిరి రవంతయు బోయినపిమ్మట నీముఖము చూచి నేను జీవించియుంట కన్న నిప్పుడే యీపాటి నీవుచూచుచుండఁగనే నాప్రాణంబులు విడుతు"నని యుఱివెట్టుకొనఁ బ్రయత్నించెను. అంతలో భగవంతుఁడు తనప్రమథగణంబులతోడను, నందీశభృంగీశాది రుద్రగణంబులతోఁడను నారదాదిమహామునులతోడను, వాగీశలక్ష్మీశాదులతోఁడను సాక్షాత్కరించి "అవ్వా! నీకేమికావలయునో కోరుము. నిన్నుద్ధరింప నేను ప్రత్యక్షమైతిని నీభక్తికిమెచ్చితిని నీభ

క్తికిలోబడితే నేను బిడ్డఁడనై నీయొద్ద మెలఁగితిని ఇక నీకు మోక్షముగావలెనా? ఇహలోకజీవనముగావలెనా చెప్పుము. నా యనుచరులు నైతము నీభక్తికి ఎహ్హు సంతసించుచున్నవా'రని సాంబశివుఁడు తనతోఁ బ్రసంగించుటవిని యామె దుస్సహానందము తనయనుయకత్వముఁ దేట పడునట్లుగాఁ జూచువారలాశ్చర్యము పడునట్లుగా నాదేవుని దేవుఁడని యెఱుంగక తనబిడ్డఁడనియే భావించుకొనుచు "నాతండ్రీ! నాకేవరము నక్కఱలేదు నీకే రోగమును లేక చిరకాలజీవివై నాకన్నులయెదుట లీలావిహారంబులసలుపుచుండి లోకోద్ధారణంబు సేయుచుండుట యొక్కటియే నాకుఁ గావలసినవరము" అనియూరకుండెను అంత నా సాంబసదాశివుఁడు చిఱునవ్వునవ్వి 'అవ్వా, నీవు తల్లివై నన్ను సంరక్షించుచుండఁ నాకు జబ్బేమియుండును. నాకేమియు దేహమునందస్వస్థత లేదు. నిరామయ దేహుఁడనై యున్నాను, నీవే ఇంక దృష్టివిచారము మనస్సునందుంచుకొనవద్దు నీవు కోరినవరము నీకిచ్చినవాఁడను అని యామెకు భక్తినిఅనుగ్రహించి మఱికొంతకాలమీలోకంబునందుండి పిమ్మటఁ గైలాసమునొందునట్లు ననుగ్రహించి యంతర్ధానంబు నొందెను

## గొడగూచికథ

మఱియు శివదేవుఁడను నొకభక్తుఁడు తనభార్యయుఁ దానును గ్రామాంతరము పోవుచు నింటియొద్దఁ దమ కడసారికూఁతునుంచి యామెకుఁ జెప్పవలసినబుద్ధులు సెప్పి "యేమియు నేమానిన నొక్కపనిమాత్రము మానవద్దని సెప్పిరి" అమ్మా! నీవుబుద్ధిగా నిల్లు గాచుచుండుము. నీయాటపాటలనే మఱి మేమెప్పుడు నిత్యమును నియమముగాఁ జేయు శివకైంకర్యము మానవమాఱుగా నీవు సేయుచుండుము, మేము ప్రతిదినమును కుంచెడుపాలు మనయావులయొద్దఁ బోసి తీసికొని శివాలయమునకేఁగి యీశ్వరున కర్పణము సేయుచుండుము ఈమనముంతనానవా

లుంచుకొని యుండు నీవాసవాలుం గొనిపోయి భక్తిపూర్వకముగా శూలికి సమర్పించి వచ్చి యాపైని నీయితర పనులు సేసుకొనుచుండుము." అని యనేక విధంబులం దనయునిం బదింబది బోధపర్చి వారు గ్రామాంతరమునకుం బయనమై పోయిరి. ఆకన్నియయు మిగుల భక్తిశ్రద్ధలతోం బాలుపిదికి బాగుగం గాచి యా కాగిన పాలను దానానవాలుంచుకొన్న తూమునం బోసి దేవాలయమునకుం గొంపోయి యాలింగమూర్తి యెదుటనుంచి "స్వామీ! నాతండ్రి నీకీపాలు ప్రతిదిన మీనొప్పున సమర్పింపుమని నాతోం జెప్పి దేశాంతరము వెళ్లెను నేనీయావపాలు నీకొఱకు మా యమ్మ యిచ్చిన యీయావపాలు ముదముతోం దెచ్చితిని. పుచ్చుకొనుమని మా యీవు యెంత యీనో కాదో, పాలు తెప్పగాం గాగినవో లేదో చూచుకొమ్ము ఏలోపమున్నను నాకెఱింగించితివేని భక్తిసేతును కనుక నా యుపేక్ష యుంచి యీపాలు త్రాగి మంత నాకిమ్ము నిచ్చటనె గాచి యుండెద"నని గుడిబయటికి వచ్చి కొంతసేపు కూర్చుండి మరల లోనికిం బోయి చూడ నరికి పాలెప్పటివలెనే యుండెను అదిగని యా చిన్నది ఏమి దేవా! నాపై కోపమా, నేను కన్నెననియా, భక్తికి చిన్న పెద్దతనంబుల నవసరంబులు గోలనక్కఱ యనియా, కొల్చి చూచుకొమ్ము మామూలుకన్న మఱి గిద్దెడో, సోలెడో, పెచ్చుండును గాని తక్కువ యుండదు నాతకు కొలబుడ్డకు సరిగాం దెచ్చితిని ఒకబిందువైనను దొంతకనీయక బహుజాగ్రతగాం దెచ్చితిని. పాలలోం బంచదార కలవలేదనియా మాతండ్రి నాకుం జెప్పలేదు కావలసినయెడల నరనిముషములో నింటికిం బోయి తెచ్చియిచ్చెదను లేదా వానికేదో దటుకులు గావలెనా నీమనసులోమాట నాకెట్లు దెలియును నీవీపాలారగింపని చో నాతల్లిదండ్రులు నన్నుం గొట్టితిట్టుదురు. కాంబట్టి నాతండ్రి నన్నిట్టులు సెట్టక నీమనస్సులోని యభిప్రాయము వెలిబుచ్చి నా చేత నాప సేయించుకొని పాలారగించి నన్నంపుము నేనింటికడ నింక యునేక పనులు సే

నుకొనవలసియున్నది నీవునీయభిప్రాయము సెప్పునంతవఱకు నేను లేవను" అనిసాష్టాంగపడి యేడ్చుచుండెను ఇట్లుగొంతసేపు విలపించి తుదకు స్వామిపాలుత్రాగియుండునని లేచికన్నులుతుడుచుకొని చూచు సరికిఁ బాలునట్లనెయుండెనుగాని యొకబొట్టయినను తఱుఁగలేదు. అదిగని యేడ్చుచు పెద్దగొంతుతో "దేవా! నీకుఁగనికరములేదు విషముఁద్రాఁగిన కఠినచిత్తునకుఁ గనికరమెక్కడనుండివచ్చును విషము మెసవిన నీనోరుచేదెక్కి యున్నది. ఈతీయనిపాలుద్రాగిన ఆనోటి యరుచిపోవును నీవిపాలుద్రాఁగనిచో నాతండ్రి నన్నుఁబడఁగొట్టును వానిదెబ్బలచేఁ గుళ్లి చావవలసివచ్చును అట్లు దుర్మరణంబునొందు టకంటెనో ముక్కంటీ, సీముంగల నీశిరంబుపై నాశిరంబుమోపి యొక్కనాటి కపాలమాత్రము సేసుకొని నీలోనైక్యమైపోదును. ఇంతకన్నమరియొండు మార్గము నాకుఁగానరా" దని యాలింగము నెత్తి మొత్తుకొనుట తలకించుటలో నాలింగమూర్తి తటాలున రెండుచేతులునాచి యొకచేతను పాలముంతఁబట్టుకొని వేరొక్కచేత నామెఁ గరియుంబట్టి యా ముంతెడుపాలు గుటుకు గుటుకున నొక బొట్టుగాఁ ద్రాగె. తడియైనను లేకుండునట్లుల ముంత నాకివేసెనటుల నారగించి యాముంత నాయింతిచేతికిచ్చి మాఱుమాటాడక విడిచిపెట్టెను ఆముద్దియువద్దయునొద్దికతోఁ బాలుశూలిత్రాగెనని కడుమోదంబున నింటికేఁగి యితరపనులుచేసికొనెను ఇట్లు ప్రతిదినము నావనిత గొనిపోవుపాలు మామూలుప్రకారము స్వామి త్రాగుచుండెను. ఈప్రకారము గొన్ని దినములు సనినవెనుక నొకనాఁడుముంతతోఁ బాలుగొని యాచేడియ వాడుకప్రకారము స్వామిచేతికందియ్య నాతియ్యవిల్తుని గొంగ దొంగవలె పాలారగించి శుష్కపాత్రంబు నాబింబోష్ఠి కిచ్చిపుచ్చిన నామెసంతోషముతో నింటికిఁ బోవుచుండ నా మార్గముననే గ్రామాంతరమునుండి వచ్చుచున్న తల్లిదండ్రులాబిడ్డగని యెక్కడినుండివచ్చుచుంటివని

డెక్కడతాఁగనే రాకాశి. నిన్నుఁ బొట్టఁబద్దలగునటుల నొక్క తాపు దన్ని యమలోకమున కంపెదఁజాగుము నీవుకూఁతురవా. కాదు. నాదేవుని తలు ప్రుక్కినపాతెరవు ఇక నిన్నుంచఁగూడదు" అని డొక్కపైఁదన్న యత్నించునంతలో నాచంటిగమన యశ్వగమనమై యొక్కనోటున "శంభో! శరణు శరణు శరణు నాస్యథాభవితం మయాదుష్కృతం క్షమస్వేశ ణామయ" అని పెద్దగొంతుతో నేడ్చుచు లింగమూర్తి పైఁబడెను అపాటుతో లింగము భిన్నమై రెండుపాయలు కాఁగా నామహిమ సూలోనికిం బోవుచుండెను. "బిడ్డా! నీకుభయము లేదు నాలోనీనవై చి కాలమునానుండుదుము." అని భగవద్వాక్యము వినఁబడెను. అప్పుడా భక్తురాలు తనకు సయాభక్తి దెలుసుకొనఁజాలక "బిడ్డా! పోతివా" యని పట్టుకొనఁబోవునంతలో నంతయు లోనికిఁబోయి వానితలవెండ్రుకలు మాత్రమాశివదేవుని చేతిలోఁ జిక్కెను అంతలో లింగాకారమంత్రిపూడిపోయెను దానిపై నామెతలవెండ్రుకలు మాత్రము తగ్రంటిపట్టుపిడిచి వి వేల్లుచుండెను ఇట్లు భగవంతుఁడా ముగ్ధభక్తురాలిపైఁ దినలో నైవేద్యముసేసి కొనెను ఆ లింగమూర్తి హృదయమున వ్రేలుచుండెడి వెంట్రుకలు ఆఱు నెలలకొకసారి మొలుచుచుండుటచే కత్తిరించుచుండును. యిప్పటికి నాయాలయమున నాసివలింగముపై వెండ్రుకలు కనఁబడును. ఆఱు నెలలు కాఁగానె మొదిగినంతెమట్టు కత్తిరించి వేతురు ఆశివదేవుఁడను భక్తునికూఁతురువంటి భక్తులు ముజ్జగంబులంగలరే మూఢభక్తికిని గూఢభక్తికిని భగవంతుఁడు ప్రసన్నుఁడైనటుల మఱియేభక్తికినిఁ బ్రసన్నుఁడుకాఁడు. అగాడగూఁడయను నాచిన్నదాని మూఢభక్తికిఁ బ్రత్యక్షప్రమాణ మిప్పటికి నా లింగమూర్తియే. ఈకథఁ జదివిన వినినవారికి సకలసుఖంబులు నీశ్వరకరుణచేఁగలుఁగును.

## దీపకదళియారుకథ

కంబయను పట్టణమున నొక శివభక్తుఁడు దీపకదళియారను నామంబున వాసంబు సేయుచుండెను ఆతఁడొకనాఁడు వేఱే యొకవ్యాపకముపైని గ్రామాంతరము బోవుచు మార్గమధ్యమున నొక యడవిప్రదేశమున నొకపాడుపడిన శివాలయముం గాంచి యిట్లు చింతించెను " ఆహా! ఏమియీవింత శివుఁడీయరణ్యమున నున్నవాఁడు, శత్రులవలన నేమికీడు మూడునోగదా, ఈతని కెప్పుడును పెద్దవారితో వైరము త్రిపురములం గూల్చెను మఱియుఁ బెక్కురక్కసుల నుక్కడంచెను తాను దయాళువని లోకప్రసిద్ధిగదా ఇట్టివాఁడుగుఁడప వారివారితో తనకేల విరోధముఁగొని వెచ్చుకొనవలెను. తనదయాళుత్వము దేవతలకు మేలును రాక్షసులకుఁ గీడును గలుగఁజేయుచున్నది రాక్షసులే బలవంతులు వారి విరోధము గూడదు ఇట్టివిరోధులుగల యీతఁడు కారుచిచ్చిట్లు గ్రమ్మిన మహారణ్యమున నుండవచ్చునా? ఇతనికు గుడిపడిలము లేదు చుట్టును ప్రాకారము లేదు, తలుపులు ద్వారబంధములు లేవు సోమసూత్రము గానరాదు పార్వతియుండు చోటు గానరాదు ఇంత కట్టుదిట్టము లేని యీయాలయమునఁ బూజానమస్కారముల యిట్లుంగుటకుఁదన కేమి భయము వచ్చినది కానిమ్ము. ఇక్కడ నొకపెద్ద గోపురములతోడను చుట్టుప్రాకారములతోడను గట్టిపట్టువట్టి నేనొక పెద్దగుడి నిర్మించెదను "అని తిరిగి గ్రామమునకుఁ బోయి తన యాస్తినంతయునమ్మి యా ధనంబుగొనివచ్చి యచ్చట నొకగొప్ప ప్రాకారముఁగట్టించి దానినడుమ నొక పెద్దయాలయమును గోపురద్వారబంధ కవాటగవాక్షములతోడను చిత్రంబులగు బొమ్మలతోడను నిర్మించి యాలయంబునకుఁ గ్రమముగు సోమసూత్రము మెత్తించి పార్వతీదేవి యాలయము వేఱుగఁ గట్టించి యర్చకుల నిర్ణయించి వారలచే యథాకాలయథావిధిపూజలు

నిత్యంబు సత్యాంతవిభవంబుతో నీశ్వరునకు నీశ్వరికిఁ బ్రహ్మోత్సవములు జరుగు నేర్పాట్లు చేయించి యంగళ్లు పెట్టించి యిండ్లుగట్టించి యందు సంసారులను దించి వారలకు భోజనసదుపాయముల నేర్పఱచి స్వామినిత్యసేవకుఁ బాకళ్లు నంగళ్లు వేశ్యలు కులాలురు స్వస్తివాచకులు మొదలగు సేవకాండ్ర నియమించి తాను ఘనకర్తయై రాగభోగాదులు క్రమముగా నెరవేర్చుచుండెను. ఇట్లు పరమభక్తిపరాయణుఁడగు దీపకళియారు భగవంతుని సేవ చేయుచుండగా గొన్ని సంవత్సరములు స్ఫూర్తిగాఁ బూజ జరుగుచుండఁ బిమ్మట క్రమక్రమముగా మానసవృత్తులు సకాలమున నీయలేకపోయినందున వారందఱును మానుకొనిరి. ఆ భక్తుఁడు నప్పటినుండి తనకు గల వస్తువులచేఁ బూజగావించుచుండెను. కొన్నాళ్లకు వారును మానుకొని యూరు విడిచిపోఁగా భక్తుఁడు తానే పూజ యొనర్చుచుండెను. పూజాద్రవ్యంబు లేవియు నన్ని లేకపోయినను దీపసేవమాత్రము తప్పక లేకుండ రాత్రింబవళ్లు ప్రజ్వలమై నయఖండజ్యోతి వెలుఁగునట్లు చేయుచుండెను. ఆయనకు కొన్నాళ్లకు దీపమునకుఁ జమురును దుర్లభమయ్యెను. అప్పుడు భక్తుఁడు చుట్టుపట్లనున్న చెట్లుకొట్టి తెచ్చి కాల్చుచు దీపపుకాంతిఁ గలుఁగఁ జేయుచుండెను. అంతనా చెట్లును సంపూర్ణములయ్యెను. తానుండిన యిండ్లయొక్క పైకప్పును, దూలములు వాసములు తలుపులు ద్వారబంధములు కాల్చి వెలుంగుఁ గలుఁగఁ జేయుచుండెను. అవియును జెల్లిపోయెను. తుదకా భక్తుఁడు దాను మాత్రము మిగిలి మఱి యేద్రవ్యమును లేకయుండెను. స్వామియాలయమునకు దీపము లేకయ్యెను. అప్పుడా భక్తునికి మఱి యేమియుఁ దోఁచక తనతలవెండ్రుకలు మీఁదికిఁ గట్టి యా కొనలనన్నిటిఁ దగిల్చి రగిల్చి వెలిఁగించి యదియే దీపంబుగా నాలయముచుట్టును దిరుఁగుచుండెను. వెండ్రుకలు గాలి తలలోని మెదడంటుకొని కాలుచుండి వెలుఁగుచున్నను వానికిఁ జైతన్యము లేక యట్లనే తిరుఁగు

చుండెను. అప్పుడు భగవంతుఁడు తనప్రమథగణంబులతోఁడను వామాంగోత్తమాంగ విరాజమాన గౌరీగంగలతోఁడను బాలచంద్ర శిరోభూషణములతోఁడను నాగయజ్ఞోపవీత నాగచర్మనాగాభరణంబులతోఁడను ప్రత్యక్షమై "నీభక్తికి మెచ్చితి వరమడుగు" మనఁనా భక్తాగ్రేసరుఁడు 'నాకేవరమునక్కఱలేదు మనమీయరణ్యంబున నుండవద్దు పద పోదము నాగుడితోఁ గైలాసంబునకు" అని విన్నవించెను. అదివిని యుమాశివులు తాపసినేత్రుఁ డాయాలయముతోఁడ నాతనిఁ గైలాసంబునకుఁ గొంపోయెను. ఇట్టిచిత్రంబులుగలవె గుడితోను కట్టెతోను కైలాసంబునకేగిన యీయేకదళియాను కథఁ జదివినను విన్నను మిన్నువాక దాల్ప నల్పంబులగు నాయురారోగ్యంబులిచ్చి ధనకనకవస్తు వాహన సమృద్ధులొసగి రక్షించును

## నాట్యసముత్తాండికథ

కంచి యొగాపురము న నాట్యసముత్తాండి యనునొక భక్తుఁడు కొండొకనాఁడు శివాలయమునకేగి యందు తాండవలింగమూర్తి దర్శనము సేసి యామూర్తి వీక్షించి పైకెత్తఁబడిన కాలొకటియు నేల మోసిన కాలొకటియు వంగినసడుము వక్రముగను విపరీతాకారమును జూచి యాగుడిపూజారితో నాముకవబత్తుఁ డిట్లనియె. "ఓయీ! నంబిదేవుని యాకారమిట్లేల విపరీతముగానున్నది చూడుమదిగో! ఒకపాదము నేలనుమోపియు మోయనట్లున్నది - మఱియొకపాదము నిగికెత్తబడి యామిన్ను వెన్నుదన్నియున్నది. నడుము వంగి యసియాడుచున్నది శరీరమంతయు నొకదిక్కునకు నొరిగియున్నది చేతులు కదలుచున్నవి పిడికిట నేమియో పట్టినట్లున్నవి అవి యాచేయిగదలుట నొకవిధమైన ధ్వనిఁ గలిగించుచున్నది కన్నులు మూయఁబడియున్నవి భూషణములు నడలియున్నవి. మెడలోనిహారములు చిక్కువడియున్నవి కేశపాశము విడియున్నది ప్రక్కలోని పార్వతి గానరాదు ఒకప్రక్కదగ్గఱఁ గూ

ర్పుండి సూచుచున్నట్లున్నది ఇదియంతయుఁ గన నాకు భయమొదవు చున్నది ముక్కంటి యొంటికొక యిక్కట్టువాటిల్లదుగదా నిజము సె ప్పుము " అని మఱిమఱియు నడుగు భక్తుని యమాయకత్వమును గని యాయర్చకుఁడు వాని వంచింపఁదలంచి "భక్తవరుఁడా! నీకేమి సెప్పుదు. ఇప్పరమేశ్వరుని కిది యొకమహావాతరోగము గన్పించినది నేనునునీవలె నిదిగని యాశ్చర్యపడుచుంటిని. తగినమందు పడకపోయిన నదిప్రమా దించు" నని యనునంతలో నాభక్తుఁడు సతగునఁ బరుగెత్తి యింటికిఁ బోయి తనకున్న యావదాస్తియుఁ దెగనమ్మి ధనమువట్టుకొనివచ్చి యానంబిచేతికిచ్చి వైశంబమందు సేసి యిమ్మనియడిగెను. "మఱియు నీ రోగమొంతవేగముగా నివారణచేయుదు వంతవేగము నేనును నాదార యు నాసుతులును నీదాస్యము సలుపుచుందుము ఈభగవంతుఁడె సా క్షి" యని బహుసేనముగా వేఁడుకొనెను. అంత నాటక్కరిపూజారి యొక్క ప్రాయిచ్చెట్టి యంటఁ గొని తనయింటఁ గొంతయాముదము ను బోసి యాముదపాకులు, జిల్లెడాకులు, మొదలగు కొన్నియాకులపస రుదీసి పిండిమఱిగించి పొంగినదించి వడియఁగట్టి "ఇదియొక తైలము దీని పేరు మహావాతతైలము. శివునికిది యెమందు సీవుప్రతిదినము దే వుని దేహమున నిడి మర్దనాసేయు చుండుము రోగముకుదురు "నని చెప్పి యిచ్చెను. ఆభక్తుఁడు నిదేక్రమమున నిత్యము నాతైలము మృత్యుం జయునాడలికి మర్దించి కొన్నాళ్లకాచమురు ముగిసినను లేశమైన గుణములేకుండుటచే తాను మఱికొంత తైలమువండి యాయాకుల రస ముతోఁగలిపి స్వామిశరీరము నకుఁ బూయుచు నిను పాట్లములతోఁడ ను వేడికొటియావిరిఁబట్టిన బట్టచెంగుతోఁడనుఁ గాచుచు రవంతయైనఁ గుదురకుంకుటచే విసిగి "ఇంక నీరోగముమానదు ఇట్టివాతములకు మహామావియె తగిన మందు మహామావియనఁగా సలసలమఱిగెడు నూనెలోనఁటిలో నుడికిన సర్వావయవప్రాపేతమానవదేహపు మాంసపు

ముద్దుఁగదా. నేను యిట్టిమందుగాకున్న నీరోగనివర్తిగాదు కనుక ని
వ్విఁడేయట్లయ్యెద'' వనిక్రాగెడునూనెలో దుముకనుంకించు నాతనికి
నిజపరివారసమేతుండైన చంద్రచూడుండు ప్రత్యక్షంబై ''వత్సా! నీభ
క్తికి మెచ్చితి, కోరినవరములనిచ్చెద నడుగు'' మనభక్తుఁడు ''దురాదర్శా
నావరములమాటకేమి, నీయొడలకీ తగనిరోగంబెట్లుసంప్రాప్తించె. ఇది
యెట్లుమానును? ఈ తెవులుమాన్పుకొని నీయనామయదేహమున్నా
కుఁజూపు'' మని యడిగెను. మనసిజదయ్యుండాయయ్య నొయ్యనఁజేరఁ
దీసి ''నాయనా! నాముగ్ధభక్తుఁడా! యిదిరోగముగాదు. నేను మహాన
టుండను. నాట్యముసేయఁ దలఁకొంటినేని నాయాకారమిట్లుండును.
నేను జగన్నాటకసూత్రధారుఁడను. భూమియేనానాట్యరంగము. ఆక
సంబునట్లయ. ఈచోట రెండుపాదములుంచి నటింతును. లోకంబులు
ను, లోకేశులును, లోకస్థులును, నశినపిదప నలోకంబగు నీవిశ్వం
బున నేతాండవమాడునపుడు నేనొకఁడ నేయుందును. అప్పుడనాయ
ర్ధాంగమందున్న యుంగన నాతాండవమునకు సాక్షియై యీక్షించు
చుండును. దానంజేసియే యామెకు మహేశ్వరమహాకల్ప మహాతాం
డవసాక్షిణి'' యనునామాంతరంబు వొడవెను. ఇదిగాక నాకాదిలోక
పాలకులును, లోకస్థులును, సమస్తభూతగణప్రపంచంబును, మార్కం
డేయాది మహామునులును ప్రహ్లాదనారదవసురుద్రాదిత్య ప్రముఖబర్హి
ర్ముఖపురస్కృత బ్రహ్మవిష్ణువులకుఁ గనులపండువుగా నొకానొక
ప్పుడు తాండవమాడుచుందును. ఏనెప్పుడునాట్యముసేసినను పార్వతినా
ప్రక్కనే గూర్చుండ చూచుచుండును. ఈ తాండవవేషమేగాని రోగము
లేదు. ఈనాతాండవరూపమును దర్శించినవారికి మఱిజన్మలేదు. కాన
నీవునాతోఁగూడఁగైలాసంబునకరుదెంచి మఱిభూమియందు జన్మించ
క దేవత్వముచుబొందిన యీతనువుతోఁడనే నాసన్నిధినుండు'' మని
యూఱడిం దనతోఁగొంచుపోయెను. కాఁబట్టియట్టిభక్తుండగు నీనాట్యన

మత్తాండికథ వినువారును, జదువువారును భూలోకంబున ననేకాబ్దంబులాయురారోగ్యైశ్వర్య సంపన్నులై సమస్తసుఖంబు లనుభవించి తుదకుముక్తిభాజనంబగు కైలాసంబున శాశ్వతముగానుందురు.

## కాళహస్తికన్నప్పకథ

దక్షిణకైలాసంబనఁ బ్రఖ్యాతికెక్కిన కాళహస్తియను పురప్రావరణంబున నొక్కింతదూరమున నుడమూరను పేరనొకబోయపల్లె కలదు. అందుకన్నప్పయను నొకబోయనాయకుఁడు శివభక్తిపయఃపయోధినిర్మగ్నమానుండగుచు శివపరతంత్రవృత్తినుండును. అతండొక నాఁడు వేటకై తనబోయలు కొందఱు వెంటరా నరణ్యంబునకు నాఖేటంబున కరిఁగియలసి యందునొక శీతలచ్ఛాయాసమావృతంబగు నొక భూరుహంబుపొంతఁ బరుండి కించిన్మీలిత నయనుండై నిద్రించుచుండెను. అప్పుడు గంగాధరమూర్తి యాతనియింగితం బెఱింగి తనసేవాకైంకర్యం బతనికొడఁగూర్ప నుద్దేశించి స్వప్నసాక్షాత్కారంబున నతనితో "ఈమార్గంబునఁ గొంతదూరం బేఁగితివేని నీకుదివ్యాంగంబగు నొకలింగంబు దృగ్గోచరంబగు నదియనీప్రాణలింగమనుమీ. ఏమఱక దానికిసభక్తిసేవాకైంకర్యంబు సేయుచుండుము. దానన నీకు మేలుగలుగు" నని యానతిచ్చి తానంతర్ధానంబునొందె. అట్టిస్వప్నంబుగని యాకన్నప్పయదిరిపడిలేచి, యున్నట్టుండి నలుదిక్కులంగలయంగనుఁగొన నొక తూర్పుదిక్కునఁ గాలిత్రోవని, యామార్గంబునఁ గొంతదవ్వేగునంత లోనపూర్వలింగాకారం బటఁగాంచి "భళీ! నాకలయెంతనిక్కువంబు. ఈదివ్యలింగంబట నాకొఱకే వెలసెఁ గనుఁగొంటిని. ధన్యుఁడనైతిని. వాయుమూర్తికంబును ఫాలలోచనంబునుం గలయీశునిచటఁగంటి. ఈతఁడనాప్రాణలింగ" మనిసాష్టాంగదండమిడి ప్రదక్షిణముసేసి చేతులు జోడించి మఱిమఱిమ్రొక్కి నాభాగ్యవశంబున నీశుండట నాకుఁ బ్రత్యక్షంబయ్యె. నాకలనిజమయ్యె. ఈయీశ్వరునిచట విడిచి నేఁబోఁద

గను. ఈతనిబుజ్జగించి యొడంబఱచి నాగ్రామంబునకుం గొంపోయి పాకఁగట్టి యందు బ్రతిష్ఠించి పూజించుచుండెద"నని నిశ్చయించి మఱల నద్దేవునకు పునస్సాష్టాంగంబుగావించి కైమోడ్చి సభక్తికంబుగా గద్గదస్వరంబున నిట్లువిన్నవించె— "నాతండ్రీ, నాదేవా, నాయీశా నాప్రాణలింగమా, నీవిచట నొంటినుండుటకుఁ గతంబేమి? ఎవరిపైఁ గోపమున నిచటకేఁగుదెంచితివి? నాఁడుదక్షాధ్వరంబున నిజయోగాగ్ని ని దగ్ధయైనసతికొఱకు హిమవత్పర్వతంబున నస్ఖలితయొక్కండవు మెండు పుతపంబొనరించి పార్వతీస్వాంగంబునొందితివి వామభాగమున నామె ను ధరించితివి నేఁడట్లనే నీదేహదక్షిణభాగంబలంకరించుటకు వేఱొక సతిగావలెనా? అట్లయినఁ జెప్పుము మాయూర నీకుఁదగిన కిరాతాంగన యొండుగలదు దాని నీకుఁ గూర్చెదను. దుష్టులనుజులతోఁ బోరాడున పుడు నీయొక్కగిబ్బనిప్పటికి మోహకొనచ్చి నేలబడవైచి జాఱిపోయెనా అట్లయిన నిప్పుడేపరుగెత్తిపోయి దానింబట్టి తెచ్చెదను లేకశత్రువులెవ్వరైన తరుముకొనివచ్చిరా? అట్లయిన నాయుగ్రపరాక్రమంబున నట్టిపగ పగతుని నొక్కకోలను నేలఁగూల్చి నీభయంబుఁదీర్చెదను లేదాభక్తుఁడనగు నన్నుద్ధరింపుటకిచటఁ గాచియుంటివా? అట్లయిన నాతోఁడరమ్ము మాబోయపల్లె నీకొఱకు మంచియిల్లుగట్టించి యందునీకుభోజనభాజనములకు దగిన వసతులనేర్పఱచి నిత్యము నేను సేవచేయుచుండుదును. అసలైన పుట్టతేనెయు మంచివెదురుబియ్యమును గలవు కాయగూరలనేకములు గలవు బహువిధములగు మాంసాహారములు గలవు. లేచిరమ్ము వేగము పోదము" అని యెన్నివిధములఁ బిలిచినను స్వామి మాట్లాడక స్థాణువై యూరకుండెను అదిగని కన్నప్ప తనలోనిట్లని వితర్కించె. "నేనెంతబ్రతిమాలినను శూలి మాఱుమాటాడలేదు కారణము తెలియదు.. ఐనను చిరకాలమునుంచి యీనిర్మానుష్యారణ్యప్రదేశమున నొక్కఁడ పడియుండుటచే భోజనము లేక శుష్కించి నీరసపడియున్నాఁడు. అం

దువలనఁ బలుకలేకున్నాఁడు కాఁబోలు! కానీ, నేనిచ్చటనే కొంతకాల ముంఙి యాతనికి భోజనము తృప్తిగాఁబెట్టి కొంతబలము మనస్థైర్యము గలుగఁజేసి నుఱిపెల్చుకొనిపోదును అని నిశ్చయించి యాచోట చుట్టు ను శుభ్రముసేసి యాహారాన్వేషణములకై యేగుచుండెను ఇటులుండఁ దొల్లి కొందఱు దైత్యులు శివునిఁగూర్చి యుగ్రతపంబొనర్చిరి వారలకు నా ర్యాంతిప్రత్యక్షమై "వరముఁగోరుఁడిచ్చెద మీకువలసిన బ్రహ్మవిష్ణ్వాది పదవులనైన నిచ్చెద" ననియెను. అందుకారాక్షసులు "దేవా! మాకా యాపదవులేల? బ్రహ్మాదులు మా రాక్షసులకు లొంగినవారై మా బాధలుపడలేక మమ్ము నిగ్రహించుటకు నిన్నుఁ బ్రార్థించుచుందురుగదా! వారలకజేయులైనట్టి మాయంధక, గజ, త్రిపుర తారకాద్యసురుల నీవనిర్జించితివి వారు నీచే హతులై నీసామీప్యమును బొంది నీసన్నిధినుండిరి గాని నీతోనైక్యము గాలేకపోయిరి మేము పునర్జన్మలేక నీయుదరంబున నుండఁగోరి మా దేహముల నీకాహారముగా నొసంగవచ్చితిమి మమ్మునెనవి నూరకు నీగర్భగోళముగో శాశ్వతావాసము నిమ్ము అందుండిమేము జన్మరాహిత్యులమై సుఖించెద" మనిరి అందు కాయంధకాసురభంజనుండు "ఓదనుజులారా! మీరు కోరిన కోరికబహుదుష్కరమైనది అయినను తప్పక దీర్చెదను. మీరు శ్రీకాళహస్తిపుర సమీపారణ్యమున మృగరూపమునజన్మించి యెవరికింటం బడక సంచరించుచుండుఁడు కలియుగాదిని నామహాభక్తుడు బోయవాఁడొకఁడు మృగాన్వేషణార్థైవచ్చును అప్పుడువానికి మీరగుపడుదురు మిమ్మువాఁడు సంపిమీదేహములను నాకుపండిపెట్టును అవి నేనారగించి మీకుమోక్షం బొసంగెద"నని చెప్పియంతర్హితుండయ్యె అదితిసుతులు వెంటనేవచ్చి యాయరణ్యంబున మృగరూపంబున నున్నవారు. కన్నప్పకు దృగ్గోచరులుకాగానే యామృగయుల వేఁటాడివాని మాంసంబులు రుచిపుట్టినట్లు వుల్లలగుచ్చి కాల్చిప్రక్కనున్న సరోవ

రంబున పుక్కిడునీరు నోటఁబట్టుకొని, యెడమచేతం దనకోలలువిల్లును బట్టి కుడిచేతమాంసదోర్ణికలు బట్టి తలపైఁ బూలదాల్చి వేవేగవచ్చి యెడమకాలి చెప్పుతో నిర్మాల్యముఁదీసి పుక్కిటినీళ్లతో మార్జనము చేసి తలపైబువ్వులతోఁబూజనలిపి కుడిచేతినంజుళ్లు భోజనముపెట్టి యిట్లు దినదినముఁ దప్పక సేయుచుండెను లింగదేవుఁడును బ్రత్యక్షముగా నారగించుచుండెను. ఇట్లుండఁగా మహారణ్యమగుటచే నిత్యపూజ యొనర్ప లేక యొకమిూఁగి యాఱునెలలకొకసారి గడుయత్నమున నచటకుఁ జని దేవునికిఁబూజానమస్కారంబులు గావించిమఱల వచ్చుటకుఁ బోయిన వాఁడొకనాఁడు దనమామూలుపూజ సేయుటకు వచ్చిచూచి యీస్థలమంతయు నపవిత్రమైనదని శుద్ధిసేసియథోపచారాపచారములతోఁ బూజించి రహస్యముగా నటనేగాచియుండెను ఇంతట గన్నప్ప తన పూజాద్రవ్యంబులు దెచ్చి పూజించువిధానముంగని యయ్యోయీ మాహాత్ముఁడు దేవునెంగిలిసేసెను వీఁడుతన పాదమున నిర్మాల్యవిసర్జనంబుసేయుట, యెంగిలినీటమార్జనంబు సేయుట, మాంసమునివేదించుట మొదలగు నీకార్యములెల్ల స్వామియెట్లుసహించె వీనినెట్లయిన నంతంబునొందింపవలెను నేనువీనితోనిగ్రహించరాదు. తొంటియేనుంగును సాలెపురువుసంపినటులనేఁ జేయవలెను. ఒకయరణ్యమునొక తంతువాయంబు భూరుహంబుపొంత వెలసియున్న యొకలింగమూర్తికిఁ దనతంతువులచే వృక్షశాఖలందలయు నల్లియొక యాయాకారముగా నిర్మించి దానికిఁ బ్రాకారగోపురద్వారగవాక్షాదు లొనరించి యాగుడియందు దేవునికిఁ దానుకుసుమంబులుదెచ్చి పూజించుచుండెను ఒకనాఁడొకద్విపి యాయూర్ణనాభం బొనర్చినయాపనిగని యెవరిట్లు స్వామియగుపడకుండ మూసిపెట్టిరని తనతుండంబుననాపట్టెల్ల తెగఁద్రోసి తుండంబునఁ దెచ్చిననీళ్లతో మార్జనంబొనర్చి శిరంబునఁదెచ్చిన పచ్చనిపూవులతోఁ బూజించెను ఇంతలోనుమంబులు దేఁబోయిన

సాలెపురువు ద్వీరదచేష్టితంబునుఁగని తనయంతరము వానియంతరము పరస్పరతారతమ్యము నఱయక సాహసించి యాకరితుండంబు వెంబడి శిరంబునకెగఁబ్రాకి లోలోనలిచి, దోమ స్త్రిష్కముమాయచేసి దాని తోనాయిభంబును జావునటులఁజేసి నంపి తనకోపధముఁ దీర్చుకొన లేదా. నేనును నట్లే పీసింగపటోపాయంబునఁ బరిమార్చెద''నని మఱి మఱిఁజూచుచుండ నాఖండపరశుండు వాఁడు దెచ్చిన మాంసము నార గించి యొకకంట నీరుగార్చుచుండెను. ఆనీరుగారుట కనప్ప గాంచి ''అయ్యా, నాదేవుని కంటికిరోగము వచ్చినది. దీనినేనెట్లు మాన్పుదును ఇది యేమిరోగమో పోల్చువారెవలు మందిచ్చువారెవ లు. తెచ్చువారెవలు.'' ఇట్లని యనేకవిధంబుల నాలోచించి ''యిన్ని పాట్లుపడుటకన్న నాకుడికన్ను నవలీలఁబెఱికి స్వామి కంటిమీఁద నతికి యానీరుగారుట మాన్పెద'' నని యట్లనేచేసెను వెంటనేకన్ను నీరుగా రుట చూనివేసెను. అప్పుడకన్నప్ప రెండవకంటి కెన్నడైన నిట్టిరోగ ము వచ్చునేమో అట్లురాకుండ నిప్పుడె నాయెడమ కన్నుకంటికి ముందు గా నతికివేతునని కన్నుఁ బెఱుకఁబోవునంతలో నంతకాంతకుండు పాద మూపి యాకన్నప్ప మొదటఁ దనకిచ్చిన కన్నుతనికి మఱలనిచ్చి ''నీభక్తి కి మెచ్చితిని. నీవువేఱుగ నాకియ్యవలెనా? నాకన్ను లేనీకన్నులు. నీక న్ను లేనాకన్నులు. నేనేనీవు. నీవేనేను.'' ఇట్లని సంభాషించుకొనుస మయంబున తొంటియోగి యదిగని తానున్నస్థలమునుంచి గ్రుయులుపడి కన్నప్పకు సాష్టాంగదండంబుల్ మ్రొక్కి ''నీయెడనేఁజేసిన యపరాధంబు నకు నన్నుక్షమింపుము. భక్తుఁడవన నీవేభక్తుఁడవు. శివైక్యంబన్ననీదే. నీవంటి శివైక్యాంబరతంత్రులు మఱిలేరు మాథభక్తుఁడవు నిన్నుఁ బూ జించినఁజాలును. శివునివేఱఁ బూజింపఁబనిలేదు.'' అని బహుబంగుల నాతనిఁ గీర్తించుచుండఁ జూచుచున్న తల్లి భవానీదేవియు నక్కడ ని క్కటిని నిలుచున్న భక్తులగు ప్రమథగణంబులు నతికుతూహలులగు

చుండిరి అంతలోఁ గన్నప్పది దిక్కుముక్కంటియును పన్నగభూషణుని దిక్కుఁ గన్నప్పయుఁ బరస్పరాలోకంబులు సేసుకొనుచుండ వారిదృష్టు లన్యోన్యంబు నేకీభావంబులగుట నెల్లఱుంగాచి మించినభక్తియోగంబునఁ దదేకదృష్టులైవారి దెసఁ బఱఁగించుచుండిరి అప్పుడప్పరమేశ్వరుండు గన్నప్పను గాఢాలింగన పరితుష్టునిఁజేసి "నీకుఁబుగ, పార్థంబులు నాలుగునిచ్చెద ఇంద్రాదిదేవపదవులనైనఁ గోరిననిచ్చెదఁ గోరు" మనవమ్ముగ్ధభక్తుం మ్ముృదునితో "దేవా! నాకు మోక్షమన్న నేమియో దెలియదు పురుషార్థంబుల తెలివి మొదలేనున్న ఇంద్రాదిపదవు లేల? నాకుఁ గావలసినదొక్కటియె అదియేకన నీదృష్టిసర్వదా నాపయిం బ్రసరించుచుండవలె నాదృష్టియెల్లవేళల నీయంఘ్రులయు దనిలిచి యుండవలెను మనమిద్దఱముఁ బరస్పరాలోకనే హదన్యోన్యదృగ్జాలుర మైయుండవలయు నింతియనాకోరిక "అని యూరకున్న కన్నప్పను గరుణార్ద్రదృష్టింగాంచి తనయెదుటను ంచుకొని యొకరినొకరు సర్వదా నిరీక్షించుకొనుచుందురు నేఁటికినిఁగాళహస్తిలో సీశ్వరసాన్నిధ్యంబునఁ గన్నప్ప విగ్రహంబునుగలదు ఆకన్నప్ప పుక్కిటినీరే దేవునికిచూర్ణనము సేయుచుందురు ఆకన్నప్పను ముందుబూజించి యాశేషించిన పుష్పాదిద్రవ్యంబుల శివునిఁ బూజించెదరు శివునికిఁ గన్నప్పనము సేసినవాఁడగుటచేఁ గన్నప్పయను పేరనాభక్తుఁడు ప్రసిద్ధికెక్కెను ఈకన్నప్పకథ జదివినను, విన్నను, వ్రాసినను సద్యోముక్తికలుఁగును వింటిరా భక్తవరులారా! భగవంతునికి భక్తులయుందున్న గౌరవము తనభక్తుని కగ్రపూజయిచ్చి యాతని శేషంబునుదాఁ గొనుచున్నవాడు ఇట్టిముగ్ధభక్తులనెందఱినో యీశ్వరుఁడు కాపాడుచుండుట వినుచుఁటిమిగదా వారలచరిత్రంబు లీతీరున సేమనము ప్రసంగించుకొనుచుండుటలో లోకవ్యాప్తంబులైనవి" అని చెన్నబసవన్న యడిగినప్రశ్నవై నతండు వినుచుండ భక్తులకు బసవేశ్వరులు ముగ్ధభక్తులకథలువినిపించి మఱియు

నాభక్తులను సంబోధించి మున్ను కళియంబనాయనారను భక్తుఁడు
సర్వదా యిట్టిమహాభక్తులకథలు సెప్పుచు మీవంటిభక్తులను దనుపు
చుండెడివాఁడని మనము వినలేదా? అట్లనే నేఁడు నేను మీచెవులకింపుసొం
పొదవెడికథలవినిపించి మీసేవ సేయఁగలిగితి నింతకన్న నాజన్మంబున
కువేఱసార్థకతయున్నదె” యనుచు వారలగోష్ఠినిఁ గొలువుదీర్చియుం
డెను

## సకలేశ్వరమాదిరాజు కథ

భూదేవి కంఠహారమున నాయికామణియనందగి నంబెయనునో
కపురంబున కధీశుండై పురమర్దనుభక్తుండగు నొకండు సకలేశ్వరమాది
రాజను భూనాయకుం డనపాయవృత్తినిఁ బ్రజాపాలనంబు సేయుచుండె
ను అతండు సకలసుగుణ నికరప్రపూరితుండును, శమాదిషట్కసంప
న్నుండును, సకలరాజ్యాష్టాంగయోగసిద్ధుండును, నమలినచిత్తుండును, బ్రవిమ
లతృప్తియు నజస్రప్రతాపానల్పగర్జ సూర్యతుల్యుండును బాధితా
ఖండలప్రతిమసంపదలుండును త్యాగభోగ భాగ్యధనకనకవస్తు సంప
త్తిప్రపూరితాక్షయుండును, సంగీతసాహిత్యవాగ్వైభవ సమగ్రుండును
దాసీదాసాది పరిజన ప్రజాపాలనానురక్తుండును, వీణాగానవాద్యవిద్యా
నిపుణుండును, వేదవేదాంగపారగుండును, శ్రితకల్పభూరుహుండు నగు
చు నవనినేలుచుండును. ఇట్లుండ నొండొక కాలంబున కాతనికి జంగమలిం
గానుభవ ప్రపత్తి గలిఁగి ప్రతిదినము గడియగడియకు నితరచింతలుమా
ని, రాజ్యభారంబు మంత్రిపై నిడి లింగపూజసేయుచుండును పూజాస
మయమున ననేకవిధంబులగు ననేకచిత్రవిచిత్ర రూపంబులఁదంబుమీటె
డు ననేకాహ్వయంబులగు వీణెలననేకరాగంబులను మేళగించి వాయువ
శంబున నాయారాగంబుల నాయావిపంచులు పలుకుచునుండునటుల నేర్ప
ఱచియుంచును శంకరాభరణము మున్నగు శివప్రీతికరంబులగు రాగం
బులు పలుకఁబడు సమయంబుల నాయుమాధవుఁ డావీణెయం దనే

సమర్చుకొని తా ననేకరాగంబులం బాడుచుండ నయ్యండజయాన యగు జలిగొంక్షతేని కూర్మికూఁతురు నాదంబునకు దగులయశ్రుతుల నతుల వినోదంబునఁ బురిగొల్పుచుండును. అదిగని ప్రమథులు నితాంతప్రమోదకంతురితస్వాంతులగుచుఁ జూచుచుందురు ఇట్లత్యంత భక్తిసమంచితుండగు నయ్యుత్యుత్తమ భక్తుండు కాత్యాయనీ భర్తృపూజాతత్పరుండై యొకానొకనాఁడు శివభక్తులెల్లఱుం గలసిమెలసి సుఖగోష్ఠినుండ మాదరసువినుచుండ శ్రీశైలంబున మల్లయను లేక మల్లిఖార్జున నామకభక్తుండొకండు రాజ్యంబువిడనాడి భక్తియోగంబున జ్ఞానయోగ బునొడఁబాటనేకభావంబులుగొన దేవత్వంబునొంది శ్రీశైలమల్లిఖార్జునుండనఁ దానే యాపర్వతాధిష్ఠానదేవుండై యున్నవాఁడని విని యాతని దర్శింపఁగుతూహలుండై తనరాజ్యంబువిడిచి యతిప్రయత్నకృతప్రయాణంబుల నాశ్రీశైలంబునకుఁ జని యందలి విశేషంబులం గనుచు పోవుచుండెను ఆపర్వతరాజంబున సమస్తంబును లింగమయంబె చెట్లు నదులు గండశిలలు గుహలు మృగములు పక్షులు సరీసృపములు లోనగు సమస్తస్థావర జంగమ పదార్థంబులన్నియు నాతనికిఁ గేవల లింగాకారంబులవలె గనుపట్టుచుండెనివి ఇట్టివిశేషంబులఁ గనుచుఁ బాతాళగంగలో మునింగి ముక్తిగుండంబునఁ గ్రుంకువిడి మూలవిరాళ్లింగ దర్శనంబుగావించి యింకమల్లిఖార్జున లేక మల్లర్సు ప్రత్యక్షలింగమూర్తి దర్శనంబున కాతని నన్వేషించుచుఁ బోవంబోవ మార్గమధ్యంబున నొకచోట నతనిదృఢభక్తి నరయుఁగోరి మల్లరసు తనయోగప్రభావంబున విశ్వరూపంబుదాల్చి త్రోవనరికట్టి యడ్డంబుగా నితనికేగుటకు దారిలేకుండఁ బండియుండెను మాదిరాజు చనిచని యావిశ్వరూపునిఁ గాంచి యువికాళ్ళుసేతు లివితలయను సంగవిచక్షణలేక పడియున్న యీరూపంబేమి ఇదియొక కొండయో, బండయో, భూతమో, మృగమో, నదీప్రవాహమో, సత్వతత్త్వశాస్త్రీక హామో, నిరూపింప శక్యంబుగాకున్నది.

వినను దీనితల యెక్కడనున్నదో సూతమని చని మూఁడుసంవత్సరము లేకప్రియాణంబుగా నరిగినను దలగానరాలేమ మఱలివచ్చి కాళ్లుదెస గనుఁగొందమని యాదిక్కున నెనిమిదిసంవత్సరముల నవరతప్రయాణం బొనర్చినను కాళ్ళుకనఁబడలేదు. అంత యథాస్థలంబునకు మఱలవచ్చి సాష్టాంగదండంబాచరించి చేతులుజోడించి "మహానుభావా! నీమహాత్మ్యం బుఁగనుంగొన నాయింద్రాదులైనం జాలరన నేనెంతవాఁడ. నన్ను గ్రహింపు" మని యనేకవిధంబుల నమ్రుఁడై క్రమవాగ్రసంబాలని చె విసోకం జేయుటయు నానుల్లరుసు ప్రత్యక్షంబై మాదిరాజు నాలింగనం బుసేసికొని నీభక్తికిమెచ్చితి నీవిట శివపూజ సేసికొనుచుండుమని యత నికొక యాశ్రమంబుఁ గల్పించి యీ చెట్టు గొమ్మనీడ బహు దూరప్రసారి నీ విక్కడ నిశ్చల జప సమాధి నిష్ఠనుండుమని చెప్పి యాతనిమరల భూమికిబంపనూహించి, యంతలో కొంతకాలంబునకుఁ దానొకగొల్లని రూపంబుధరించి యేతెంచి యామాదిరోజున్న చెట్టుకొ మ్మనతికివైచెను అంత నామాదిరాజయోగి యా గొల్లవానింగని "ఓరోరి మూఢుఁడా, పాపాత్మా, నీకునఱుకుటకు మఱిచెట్టుకొమ్మ లులేకపోయెనో? నాయున్నవృక్షశాఖయే ఖండింపవలెనా? చూడు. నిన్నునాకోపానలంబున భస్మముసేయ గలనుగాని తపస్వికిఁ గోపము కూడదు" అని తన్ననేక విధంబుల దూషించుచున్న మాదిరాజుంగని కపటగోపకుండగు మల్లరుసు నవ్వుచు "నేమయా, యోగిపుంగవా! మహాతపశ్శాలీ, నీయాగ్రహంబునకు మేఱయేమి? నీవు తపస్వివా? తాపసికిఁ గోపముండవచ్చును నేను పాపినంటివి లోకులు పాపాత్ములు గాని వారెవ్వరు?" పాపాత్మ పాపస భవ, యను నార్యోక్తి విన లేదా? మనపుట్టువు పాపకూపమునందుండి మన పెఱుఁగుట పాపలోక మున మనమరణము పాపమువందే నాకుఁగొట్టుట కొక చెట్టులేదా యని యడిగితివి నీకు నివసించుటకు మఱియొక్కచెట్టు లేకపోయెనా?

సంసారముత్యజించి మీవంటిసన్యాసులు మఱల నీమణత్రయాభిలాష వ్రింపుటఁ గాదే నీవిప్పుడు కోపించబవలంబించుట సర్వసంగపరిత్యాగి యగు యోగికి కాలస్థలవిచక్షణంబు లేల? తపంబున కెచటనైనను సరె యెప్పుడైననుసరె” ఇట్లని యనేక విధంబుల సోదాహరణంబుగ నాతనిమాదలించుచు నిజరూపంబు సూపిన మల్లికార్జునస్వామినిఁ గని మాదిరాజుసిగ్గుజెందిన మొగంబుగలవాఁడై తన్నుఁ దానిం దించుకొనుచు నపరాధంబు క్షమింపుమని బహుభంగులఁ బ్రార్థించెను. అంత నామల్లయను మాదిరాజ గని నిన్నుఁ నుఱల భూలోకంబునకుఁ బంప నేఁ జేసిన పన్నుగడగాని, నీ భక్తికి లోటులేదు పరమేశ్వరునానతిని నదికేశ్వరుఁడు భూలోకమున బసవేశ్వరరూపంబునఁ గల్యాణపురింబున బిజ్జలరాజమంత్రియై యవతరించినవాఁడు అతనికి సహాయుండవై శివభక్తియోగింబున నతనితోఁ గూడ వర్తించుచు నీ భూలోకంబున నిఁక నేఁ బదిసంవత్సరములు నుండవలెను ఇప్పుడు నీకారు నూటయే బది సంవత్సరములైనవి. మఱియేబది యబ్దంబులు బసవనమంత్రితో నుంటివేని నామీఁదనిన్ను నాసన్నిధికిరావించుకొనిసెడను ఇప్పటికనీకుఁ గావలసినవరంబులు గోరు మిచ్చెద వానిం గైకొని బసవనమంత్రిఁ డనుండుము” అనుచుంతిలో చూచి రాఁ పునఃపునఃవందనంబులొనరించి ,,దేవా! నీకు వరంబు లొసంగెదనంటివి ఏమివరంబులుకావలయును? స్త్రీలఁగోరుదునా? అందఱును బరస్త్రీలే ఆయువందునా అదిమాయ దానిని గుర్తెఱుంగజాలము ఆ మాయవువచ్చు నెప్పుడో పోవు నెప్పుడో వచ్చుట నెచ్చటనుండియో పోవుటయెచ్చటకో తెలియదు పోని మ్ము ఇంద్రపదంగోరుదునా? అదియేమి శాశ్వతము ఇప్పటికెట్టి యింద్రులెందఱైరో ? బ్రహ్మత్వమందునా? అదియు నధ్రువమె ఇది యెన్నవసృష్టియో ఇంక నెన్నిసృష్టులుగానున్నవో శాశ్వతమైనది యన పాయమైనది శివపద మొక్కటియె అది నేఁ గోరనక్కఱలేదు.

నెగడా «అధర్మో ధర్మతాం వ్రజేత్» అను నానుడి పుట్టినది. ఒకరికిఁ గష్టము నిచ్చిన పనియె మఱియొకనికి సుఖముఁ గలుగఁ జేయును. ధర్మరాజు జూదమాడి తమ్ములతోఁడను, ధర్మపత్నితోడను వనవాసాజ్ఞాతవాసంబుల నిడుమలం బడెను ఆజూదమున నెగడా దమువినారపు మహాదేవు సాక్షాత్కారంబుగనెను రాముఁడు వేఁటాడి యాలింగోలిపోయెను కన్నప్ప వేఁటాడి శివునిఁగలిసె హింసవలన మాండవ్యమహాముని కొఱ్ఱతవడియె. ఆహింసవలననె చండేశ్వరుఁడు శివప్రసాదంబు వడసెను ఎరసతులంగూడిన వారందరు నరకమున యమభటుల పట్టుఁగోలలపాలైరి. పరసతిని సర్వదా యుండుకొన్న నంబి యీశ్వరసాయుజ్యంబు నొందెను క్రిముచ్చులు శిక్షాపాత్రులైయుండ గొఱియ మృచ్ఛగుహాద కుంతు నఱుకునబడి వధ్యశిలకెదురేఁగుచు మహేశుభక్తుండై విడువంబడియె మఱియు «రాజ్యాంతే నరకం ధ్రువమ్» నుటకు బ్రతిహతంబుగా వోడఁడును బేంమరాయుడును రాజ్యాంతమున మోక్షంబు నొందిరి వారిలచర్యలటు డినిమ్మ కన్నడ బ్రహ్మయ్య మాహాత్మ్యం బెఱింగించెద నాకర్ణింపుము - భక్తులాఁకొని యున్నారంబునకై తనయింటి కేవేళవత్తు రా వేళ నేయటంచు రాత్రియనక పగలనక సాధనస పత్నితో దొంగతనమునకు బయలు వెడలును కన్నము ద్రవ్వి లోనికి రిఁగి యాయింటిలోని వారలు ధరించిన శివచిహ్నంబులంబట్టి యవి భక్తులయిండ్లని తోచినఁ దొలఁగిపోవును ఇతరకులగృహంబులైన నంవలిధనంబులు గొల్లఁగొని జంగమార్చనకు వినియోగించును. పట్టపగలకేండు కన్నము త్రవ్వినపుడుగాని, లోనికేఁగి ధనసంచయంబుల గొనునపుడుగాని యితరుల కదృశ్యుండుగానుండును. ఇంటికాపులు భక్తులైనవారికి గనఁబడి చెప్పిపోవును ఇతరులైన వారలధనముఁగొని తాఁబోయినను వారిధనమెప్పటి యట్టులనుండును గాని తఱుఁగదు. అదియేమిచిత్రమో నరనాథులుగాని, భాగ్యవంతులుగాని, తన్నుఁబిలిచి లక్షలొసంగినను దొంగతనపుసొమ్మగాని యాలక్ష

లు గిఁడులు లక్ష్యము సేయువాఁడుగాఁడు. ఇట్లు కన్నడబ్రహ్మయ్య ప్రభావంబును చెప్పిన బసవేశ్వరుల బిజ్జలుండును సంభావించి తనధనంబును మఱి యొకటిఁ గాంచి సంతసించి వీడ్కొని నిజనివాసంబునకుం జనియె. కన్నడబ్రహ్మయ్యయుఁ దాఁగొన్న ధనం బిలుసేర్చుటయు, నాతనిభార్య మొసరుపని మాటలందుకొని భద్రపఱుచును ఇట్లు సంతతజంగమార్చనా పరతంత్రుఁడై కన్నడబ్రహ్మయ్య జీవవృత్తి నడుపుచుండెను అట్టి బ్రహ్మయ్యచరిత్రంబు వినువారును జదువువారును కొదువలేనిసుఖంబులనుభవించి యంత్యంబున ననుత్తమోక్ష సామ్రాజ్యంబునకుం బట్టాభిషిక్తులగుదురు

## ముసిడిచౌడయ్యకథ

ముసిడియనునొకపురవరంబున చౌడయ్యయనునొకభక్తుఁడు కలఁడు. అతఁడు శైవ సు రెండవవీరభద్రుఁడు ఆచరితసకలపుణ్యకర్మఫలత్యాగి అమోఘపరాక్రమశాలి శాపానుగ్రహదక్షుఁడు విజ్ఞానఘనుఁడు. విద్యాపారగుఁడు. అనఘుఁడు. జంగమలింగాప్రనావితోటి శ్రౌతక్రియాపరతంత్రుఁడు సాంప్రదాయికవానవారహితుఁడు ప్రాజాపత్యబ్రహ్మచారి. ఖడ్గపాణియునగు నసియుంచుమనుండి యతఁడొకానొక దినంబున వీరువారునారు సకలజనంబులును బసవేశ్వరులభక్తిసామర్థ్యంబులు పొగడుచుండుట విని యత్యంతగన నతికుతూహలంబు గలవాఁడై భక్తగణంబులోఁ గలిసి యరుగుచు ముందొకనొక యరణ్యంబు గని యందు విడిసెను. ఆ యడవిని ముసిడిచెట్లు ఫలభరితంబులై బలిసి పెరిఁగి యొక్కొక మేరునగంబు భాతిఁ గన్పట్టుచుండె. తోడనున్న భక్తగణంబులు చౌడయ్యఁ బాలికంజని "దేవా! యీముసిడిపండ్లను శివార్పితంబులుగావించి కడుపార మెసవవలెను నానమాపుఁ బొడమినది నీయానతి! నిదురుచూఁచున్నవార"మనిన ముసిడిచౌడయ్య ముసిముసినగవు మొగంబున నలంకరింపఁ దనచేతికరవాలంబా చెట్లమూలంబులకుఁ

దగులనిచ్చి యొకరాపురాచి యథేచ్ఛఁగా భుజంపుఁ"డని పిలవ్రసంగ భక్తులందఱా పంక్తులమెందుగఁగొసి లింగసంగతంబులుగావించి కడు పులనింక భుజించి "నేఁడుగదా ముసిఁడిచౌడయ్య నామము సార్థకమ య్యె"నని యాతనింబొగడిరి అంతమఱునాఁడచటఁగదలి చౌడయ్యయు భక్తులును కళ్యాణపురంబునకుంజనిరి. తొలినాఁటి తనశివపూజాసమ యమున బసవేశ్వరులు తనుయిష్టదైవమగు సంగమేశలింగమూర్తి యం దు చౌడయ్య స్వరూపమును బొడఁగని యాతండరుదెంచుచున్నవాఁ డని యెఱింగినవాఁడు గావునఁ గొన్నియడుగులెదురేఁగి పాదంబులకుఁ బాద్యంబును హస్తంబులకు నర్ఘ్యంబునొసఁగి యింటికిఁగొంపోయి శివ పూజచేయించి విందొనరించి కళ్యాణపురంబునఁ గొన్నాళ్లుండుమని ప్రా ర్థించి యీశ్వరభావంబున నాతనినారాధించుచుండెను ఇట్లుండఁగొం డొకదినంబున వీరశైవమురాచాయులెల్లరు నాతనికిఁగళ్యాణంబు గావిం పనూహించి యనేకసేవనలిచ్చి పెండ్లికింబొమ్మని బహునంబుగావించి తామును తోడనఁ జనుచు వివాహంబునకాఁతని గొనిపోవుచున్న సమ యంబున మధ్యనొక చతుష్పథమార్గంబున నొకతపస్వి మృతకళేబర మును వాహకులుపరేతభూమికిఁగొనిపోవుట చౌడయ్యగనిపెట్టి "ఓరా! యీమహాతపసిచే దీవనలనొందమి నీతఁడుఁగూఁడ రామి నాకీపెండిలి యేలయని యావాహనంబునాపి దింపించి ఖడ్గంబునూడఁబెఱికి యాతప సితనువునంటఁజేసి "మునివరా! గ్రుస్క వనిక్కలేచిర"మ్మనవుడుఁ గట్టిన త్రాళ్లుదెగి యంపుఁడితపసిలేచి నిద్రమేల్కొనివానివలెఁ గండ్లునలుపు కొనుచు వచ్చి చౌడయ్యకునమస్కరించి నిలుచున్నవానిఁగని చౌడయ్య " యోయయ్య! నీవుసాతూత్తు మినుసికయ్యపు ఏలయీానకవాహనం బున బయలు వెడలితివి నీసంగడీఁడకు గుబేరుఁడునరవాహనుఁడని నీకు నట్టికోరిక వృథమెనా? ఇఁకఁజాలు నావాహకులంబొమ్మ్నని నాలోఁడన పెండ్లికరుదెమ్ము నీయాశీర్వచనరహితంబగు పెండ్లినాకక్కఱలేదను

టయు నాతపస్వియు ముందఱనడునఁ జొచ్చెను అంతమఱికొంత దవ్వ లనరుగుచో నచ్చటఁబసులకాపరిపిల్లకాయ లాడుకొనుచు డెను. యా పులమేయవిడచి యవిచెవరిత్రోవదప్పి వెడలునపుడు వానిమళ్ళించుచు బాటలుపాడుకొనుచు గంతులు ద్రొక్కుచు విహరించుచు నొకవిష యంబునఁ దమకువివాదంబు గలిఁగిన నాతిగవ్వుఁదీర్ప నందలియొక పెద్ద పిల్లవాఁ డందఱఁ బిలిచి యాగవ్వకుసాక్షి యీబసవపటవిటపియె యనుట చౌడయ్యవిని వారలం జేరఁజీరి "యోరి' పాపలారా, బసవమ త్రియేమిరా?" యనియడిగెను అయ్యా! దీనికొక గాథగలదు తమతా తచే వింటినని మాతాతమాకుఁ జెప్పెడివాఁడు. వినవల దేని దద్వృ త్తాంతంబుఁగతయు నెఱిఁగించెదనని యిట్లు చెప్పందొడఁగె

"పూర్వకాలమునందు రెండవద్వాపరంబులు బరదర్పితములై యొండొంటితోఁబోరాడి యహోరాత్రములు మల్లయుద్ధముసేసి తుద కొకదానిచే నొకటి మొత్తబడిసె నంతనిచట శివభక్తులాచచ్చినదాని నిటఁ సమాధియొనర్చి దానిపై నిమత్తియొసఁగిరి నాటంగోలె నీమత్తి చెట్టునకు బసవమత్తియనిపేరు, దీనిఫలంబులు మాంసఖండంబులం బోలి యుండి మాంసపుఁబుడిఁ గలవియై యున్నవి దాని లిరసంబును (అనఁగాఁ జెట్టునఱికిన వచ్చెడిపాలు) రక్తప్రాయంబు కడునెఱ్ఱగానుండు" నని చె ప్పెను. అదివిని చౌడయ్య నేఁడు బసవనిచావువింటిమి బసవనంబియం దుఁబుగా ముందుఁ జెప్పిన వివాహంబునాకేల యని రొంటనున్న కత్తి దానిమొదలనత్తి "మత్తిమూలంబుననున్న యోబసవనంబీ! లేచిరా" మ్మ నెను అప్పుడు నాఁడు పూడ్చఁబడిన యావృషభంబు దంబుదారితోం టీరూపంబున గుబాలున లేచి యొకగంతువైచి చౌడయ్యను మూచూ చి చెట్టుమొదల వాసనఁజూచి మూత్రవిసర్జనంబుఁ గావించి కాలుద్రు వ్వి తోఁకయాడించి గిరగిరఁదిరిగి మత్తిప్రదక్షిణించి ఘణిల్లుమని ఱంకె వైచి ముందున్న తపస్వితోఁ దానును బుర్రగమనంబున వివాహంబు

న కరుగుచుండె నిట్లు దపసియు నాబోతును గొలిచిరా వివాహంబుకే గుచు మార్గమధ్యమున నొకయతి దీర్ఘ ప్రసారితంబగు మహానదిత్తుంగని యాకసంబున కంటుచుండిన నందలియలల కల్లోలంబుగాంచి తొలంగి పోవుచున్నని చౌడయ్య తననిస్త్రింశం బానదిపైభులం ఘుళిపించి గంభీర ధ్వానంబున బలుక నాకాశగంగచే శివభక్తులపరిభావంబు విననేగెనో యన్నటుల మీర కెరెగయునలలతో నొకహాయయ ధ్గాకతెల్ జెలిమి సేయఁబోయెనో యన్నటుల గిరిగుహలోన నిరికినాటకః నూర్మినాకార హితంబగు నల్పప్రవాహంబుగల పాయమొకటియు గా తెడుపాయలై నడుమ నేడల్పుతో నిపనిచిమెసంగిన చౌడయ్య ముందునడుచుచు గత్తినెత్తి చూపుచునండని పిలున నంచుని నాయేఱుదాటి యన్వలఁ జనినిలుచున్న చౌడయ్య తిరిగిచూచి నేఱుదాటి తృళ్లులేక మెల్లనఁ బొమ్మనియా నతిచ్చి మునివృషభుండును వృషభంబును మఱంపునడువఁ గళ్యాణంబున కుంబోయి క్రియాలోపంబురాక యథా మంత్రప్రారితంబుగా వివాహ క్రియా నివర్తించి కల్యాణపుర పునరాగమనంబున ముందున్న ఋషివృషభముల చరితంబుఁ బురిజనులువిని యమందానందంబున బారలంగ బుర ప్రవేశంబుగావించి నగరాజుపప్రయోగ మంత్ర ఘోషంబుగు వైదికవీథి నరుగుగఁ నొకబాలశిశివుణి యాతనికినెదురై నమస్కరించి శతాయుఃపరిమాణపుగమ్మని దీవనబొంది నాటిఁజేయి సుఖంబుండి మ ఱునాఁడరుణోదయంబున నరుణకిరణ తనయునాయంబునకుం బయనంబై పోవువాని నావాహనంబుతోఁగూడ మోపికొనివచ్చి దానితలిదండ్రులు చౌడయ్య ముందఱఁబెట్టి నిన్నఁగడా యీబాలనీచే శతాయుఃపరిపూ ర్తిగా వరంబునడసి నేఁడు మిడిసినది. నీయాశీర్వచనమె గుఱిదప్పెనె డల నింక నెవ్వరి యాశీర్వచనము నిలుచును" అని యేడ్చువారలం గనిక రించి శానాశవంబునొద్దకుఁబోయి మండలాగ్రంబున దాని తన్యాగ్రంబు నంటి 'బాలేందుముఖీ! ఏల యీలీలనిద్రించెదు పగటినిద్దర పద్మముఖు

లకుఁడగునా? కమలనయనులన యనకమలంబులు పగటిపూఁట వికసించి
యుండక రేఁగాని ముకుళింపవచ్చునా?" యనుఁడు నిద్రమేల్కాంచి నభా
తినానాతి లేచి కూర్చుండెను అంతకుమున్న దానితలిదండ్రులు చేతులు
జోడించి నిలుచున్న వారలతోఁ దాము కనకమలంబులు ముకుళించిన
నలువురకు నప్పటికిగతించిన పంచఃపరిమాణంబుగాక ప్రత్యేకశతాయః
పరిమాణాయువు నొసఁగి గమ్మువ్వురను లింగసంగత దేహులఁగావిం
చె అంత నాపురజనులు పీరువారనక యెల్లవారును జచ్చినవారి ప్రాణం
బులు మఱలనొసఁగి వారలరక్షింప నాదతాత్పర్యరక్షింపఁ యోపుఁగాని
యన్యులోపుకురే యని తన్నుఁ గొనియాడుచుండఁ జేడయ్యయెప్పటి
యట్లఁ దనయథాచిత వర్తనంబుననుండి నట్టియెడఁ గొందఱు పరమతా
వలంబకులు తనులోఁదాము చేడయ్య ప్రభావమునుగూర్చి ప్రశంసిం
చుకొనుచు" నీతండాదాడనాడుకొని హాస్యాస్పదంబు నొందినవారి
ప్రాణంబులు వారికిమఱల నియ్యనేయసమర్థుండుగాని, యెన్నఁడో సచ్చి
కుళ్ళి కంపుగొట్టుచున్న మృతకళేబరమును పునర్జీవితుఁగాఁ జేయఁజా
లునే? చూతము" అని వారందఱుఁ గలసి యొకగోనెసంచి దెచ్చి దాని
జింపి కాళ్లుచేతులు గన్నులు ముక్కు సెవులు,తల కేశపు, వీపు, వ్రేళ్ళు,
గోళ్ళు, మొదలగు నవయవంబులు గలయుఁగట్టి లోనగడ్డికూరి యక్క
డక్కడఁ దార్లతోఁ గట్టులుగట్టి యూరివెలుపల నొకపాడుగుడివెనుక
బడిలిపడిచి వేర్వేఱ నొకరితోనొకరు చాడయను వినఁబడునట్లు
"నూరికడనున్న పాడుగుడివెనుక నొకదాగిమతపసి కళేబరమున్నది.
ఏనాడుసచ్చి యటఁబడినదో తెలియదు కుళ్ళి కంపుగొట్టుచున్నది ఎవ్వ
రునట సనవెఱతురు పాపమా గతజీవునికిఁ బ్రాణదానంబుసేసి చాడ
య్య బ్రతికింప నోపునేమో?" యని సంభాషించుకొనుచుండ నందుఁ
గొందఱు "మనమితరులవలె భయపడినలాభమేమి? మనము మతేతరు
లమైనను శవము జంగమమతశవము అదిగో శివచిహ్నంబు లగువిభూ

తిరుద్వారాదులు గనఁబడుచున్నవి. దానిని చౌడయ్యతప్పక బ్రతికింపఁ గలఁడుగాని దానినొక విమానమున నెక్కించి మనమందఱము మోసి కొనివచ్చి యాయనయెదుటఁ బెట్టుదమని యనుకొనుచుండఁ జని యొకఁడు తనచేతికఱ్ఱతో దానిం బొడిచి "యౌరా! కుళ్ళుగుమ్మడికాయవలె లో లోనఁ గుళ్ళినది రా. కఱ్ఱగుచ్చినంతగా బడినది ఎంతనీరు పైకి బుస్సునఁ గారుచున్నదో. కంపు కంపు బాయఁజాల" మనుచు నొకవాహనముఁ గల్పించి దానిపై నాశవమును బెట్టి నలువురు మోసి చౌడయ్యకట్టెదుర బెట్టిరి దానిమహాత్ముఁడు గని యుద్భక్తులు చేసిన మాయాగాసి మఱి యొకటిగాదు కానీ, నీనిఁ జూచి జనులందఱు వెఱఁగంద నొకజంగము మునిఁగాఁ బొందుపఱచెదనని డాయం బోయి తనకరవాలంబు నేలనాని దాని నాశవంబు శిరంబున మోపి "సూబుడుత నెలదాల్పా! యల్పంబగు నీరూపంబున నేలయడంగితివి? నిన్నుం గననిచట భక్తులెందఱు వేచియు న్నారో చూడుము. ఈక్షణము వేగము లేచిరమ్మా" యనుఁడు నామా యాశవంబె యొకయమానుష రూపంబున లేచివచ్చి చౌడయ్యపాదము లపైఁ బడి "భక్తపోషకా! నేనొకజంగమభక్తుఁడను కొల్లియేజన్మంబు నులేక యిదియేనా తొలిజన్మంబుగా నీచేలన సృష్టింపఁబడిన వాఁడను పామరులగు భక్తులు నన్ను గోనెసంచులతో నిర్మించి నీమూలమునఁ బ్రాణములు గలవానిఁగాఁ జేయించిన ను నేఁటినుండి నేను గోనెదా సుఁడను నామంబుతో నీకడ నీయనుగుబంటనై పరిచర్యలు సేయుచుం డెద. నన్నుఁగాపాడి రక్షింపుమా" యని సాష్టాంగదండం బిడి లేవకున్న నాతని లేపి పరిచారకగణములో గలుపుకొని యామాయఁ గావించిన పా పమతులగు పరమతాచారులను హతులఁగావింప దలఁకొన నాతనికిని ముక్తులై వారెల్ల అతిలజ్జావనతశిరస్కులై వేడుకొన్న వారలను గటాక్షిం చి యితరమత చిహ్నంబులందీయించి లింగసంగత దేహులంగావించి బుద్ధిగలిగి మసలుకొం" డని బుద్ధిసెప్పిన వారలు అసమానధైర్యవీర్య

ప్రతాపధాముండవగు నోచౌడయ్యాభక్తవరా! శరణాగతత్రాణకృపాణ ధురీణా! పాపచిత్తులము దుష్కర్ములము జ్ఞానవిహీనులము శివభక్తి విరహితులము నీయెడల నపరాధంబొనర్చినవారము "అన్యథాశరణం నాస్తి త్వమేవ శరణమస్మాకం" మ్మని నీయడుగులఁ బడ్డవారము. మమ్మురక్షింపుము నీవేమావాలిటి ఫాలాక్షుండవు మాయనేఁ జన్మసు కృతపరిపాకంబున నీపరిచర్యసేసి నీదాసానుదాసులమై యిలఁగలకాలము మనఁగోరుచున్నార" మని యనేకప్రకారంబులఁ గ్రవారములుసేయుచు చౌడయ్యానువముత్రులై యుండిరి. ఈముసిఁడిచౌడయ్యచరితము జదివిన వారును విన్నవారును వ్రాసినవారును వాసిలేని యీశభక్తులై సకలసుఖంబుల ననుభవించి నిటలాక్షుని లోకంబునఁ దుదిని శాశ్వతపదవినుందురు.

## సురియ చౌడయ్యకథ

మఱియు సురియచౌడయ్య యనునొక భక్తుఁడు జితేంద్రియుండును భూతదయాసాగరుండును విగళితసంసారబంధుండును శ్రద్ధానుష్ఠితకర్ముండు సజ్జ్ఞానసిద్ధుండును నసంగవికారదూరుండును నవిరళవారనశ్యంబును కారణజన్ముండును మాయాప్రపంచవిర్వంచితుండు నగుటరసాన్ భక్తాఖిలహర్షగేయను లోకోక్తిననుసరించి గురులింగభావంబులఁ జరలింగంబులనారాధించుచుండును అతఁడుకళ్యాణపురంబుననున్న భక్తులనాశక్తితోఁ బ్రార్థించి గృహంబునకుం గొంపోయి పాలునునేయియు పప్పుఁగూరలుఁ జారుఁబులుసుఁ బెలుఁగు గారెలు బూరెలు నపూపంబులు నరిసెలుఁ బంచభక్ష్యాన్నంబులు షడ్రసోపేతంబులగు నాహారపదార్థలం బౌతిలలో నొడ్డననేయించి వారలశివపూజలుసేయించి చేతులుజోడించి శిరంబునఁదాల్చి "మహానుభావులారా! భుజింపుఁ"డని ప్రార్థింప హరభక్తులకు జంగమలింగమూర్తులు కడుపులకింపార భోజనంబులు సేయుచుందురు ఇట్టుభక్తులకు శివపూజలుగావించి తానును

గూర్చుండి నిజలింగమూర్తిని బూజించునపు డానభిషేకమొనర్పక పూర్వమె యీశుని నేత్రములనుండి హర్షాశ్రులు జారుచు దేహమంతయుం దడుపుచుండును. సజ్జయందలి పువ్వులంగొని పూజించుటకు ముందె నిజమనస్సరసిజము హరునిశిరంబునం దనరుచుండును. వృకధూపం బగ్నియందు వైవకమున్నె యీశ్వరునందలి వాసనలు పైవెడలును దీపము వెలిగించుటకు మునుపె యాత్మజ్యోతి భూతేశుముందఱ వెలుగుచుండును. పక్వపదార్థంబు లర్పింపకమున్నె దనప్రాణముపహారమై యమరుచుండును ఇట్లాశర్వహిర్నిష్టల లింగమును మనోభావంబున నిత్యంశివపూజసలుపుచు నైవేద్యంబొసంగు తరుణమునకుం దనయొద్దనున్న సురియయొరంబాసి పాత్రమునకడ్డమునిల్చిన దానినందుకొని పూజావేదికకొకమూల బెట్టి ''స్వామీ' నీపునాచేతియన్నంబుం బ్రత్యక్షంబుగా స్వీకరింపలేనిచో నీసూరకత్తిచే గొంతుగోసుకొనియెదం దలచి యొకబంగరుపళ్లెరంబున సకలపదార్థంబులుం బెట్టిచి వానింగలయం గలపి కళ్లుకళ్లుగాంజేసి యొక్కొక్కటి నొక్కొవమునంబున మిక్కిలికంటి దేవరనాహ్వానంబు సేయుచు నందియ్య నయ్యిందుశేఖరుండును దన చేయుసాచి యాశ్లంపుకొని యత్యాప్యాయముతో నారగించెను. ఇట్లుప్రతిదినమునం ద్రిసంధ్యలయందు సురియచౌడయ్యతోం జంగ్రచుండుడు ప్రత్యక్షముగా నాతని చేతిప్రసాదంబారగించుచుండె ససారసంక్షేపపారావారంగతుండై యాతండునిండుమనంబున మెండగుభక్తిసలుపుచుండును. ఇట్టిపూర్వకాలమందు సైతము భవంతుండగువేదండచర్మాంబరుండు భక్తవాత్సల్యంబున వారలయిండ్ల నారగించుచుండెడివాండనివిందుము కరికాలచోడుండను కాలకంరుం భక్తుండొకడు దొల్లి యొత్తిగాంగాంగిన మిాగడపాలు మున్నూటయిరువదిపుట్ల నూతనతులుం బులవించి యందుకుందగిన శాకంబులను ముప్పందుముమిరియాలతోం బాకంబుసేయించి పళ్లెరంబులలో భక్తినునిచి యాయుధహస్తు

డై యీశేషమందఱఁబెట్టించి యారగించుచప్పుడు వినవలయునట్లు వినఁ వినఁబడని నో మెడఁగోసుకొని చెద ననియు నియమముతో నిలుచున్న యాతనికి శ్రుతిగోచరంబగునట్టులు బుడబుడఁ బీల్చి జుఱ్ఱినచప్పుడును మిగిడయుఁ గాయగూరలును నమిలినధ్వనియుఁ బిప్పిను మిసి వైచిన స్వనంబునుఁ గలుగఁ జేసి యారగించెనట మాదరచెన్నయ్య తొలిని నమున ఘనమగు భక్తితో సీశున కంబలి పెట్టి మఱునాఁడు నట్లే చేసిన ట్టి యామోఁగిలిపాత్ర నిత్యము నంబలి ద్రావుపాత్రగా నుంచుకొన్ను న నది యాతనియందలి యాదరంబున సంబాధవుండంగీకరించె ననివిం దుము. మఱియు ద్రాక్షారామమున వీరచోడన్న తాభుజించుచుఁ దన కుమిఁగిల జలిమైన కడి సగము నిలి మఱియొక మనసొప్పక దానినొకచి న్న పళ్లెరంబున నుంచి తనదాసిచేత నీశ్వరాలయంబున కనుప నదిసని యెడదినయాయక నిన్నఁదినుమని యా పీసవెన్నైకొ" మ్మని యుండి య్యా ! మేశ్వరింరా కొ ప్పరసంనకొం మా మొంగిలిమ్ముగ్గఁ దిని యా పాత్ర నాలోవెల నెలుసల బనైచునని పెద్దలుసెప్పగ విందుము ఇ ప్పటందఱుఁ గనుగొనుచుండి సురియ చౌడయ్య చేతి కళ్లందుకొని భక్షింపలేదా? అట్టి యీసురియ చౌడయ్య కథ వినువారును, జదువు వారును వ్రాయువారును, నొరులకు వినుపించువారును, వ్రాసినపొత్త ములను బత్తితోఁ బూజించువారును సద్యోముక్తింగందురు.

## తెలగుబొమ్మయ్యకథ

శివభక్తియుక్తుడును బాపహితుండును చివగ్ని నిర్దళితశుభాశుభకర్ముఁడు కారణజన్ముఁడు నిస్తులయశుఁడు వీరశైవుఁడు సంగరహితుండును సతత జంగమలింగార్చనారతుఁడును కిరాతపురారి యీరూపంబున నవతరించెనో యనునట్టుల శివసారూప్య శారీరచిహ్నుఁడునగు తెలఁగుబొమ్మయ్య యనుభక్తుఁడుగలఁడు. తండసమానదానవిద్యాపరాక్రమధురీణుండై శివభక్తిపరతంత్రుండనై లోకహితార్థంబు జన్మించి

నవాఁడుగావున నిత్యజంగమలింగపూజావిధానుండై కళ్యాణపురంబు ననుండును

ఆతండటులనుండఁగా శ్రీశైలంబున శివానందుఁడను నొకముని పుంగవుండు తపశ్చరణైకవృత్తి నొకయాశ్రమంబు కల్పించుకొని తపోనిష్ఠనుండ నాతనియొడ తెల్లఁబుట్టబలిసి నీలాద్రివలె నగుపడుచుండెను. అచటికొకనాఁడు గంధర్వులుతమ భార్యతోఁగూడి స్వేచ్ఛావిహారంబులు సలుపుచు నాతోవనాకాశగమనంబున నేఁగుచుఁ గొండవలెనున్న తంబుగాఁగన్పట్టు నాతపసిపుట్టంగని యిదియేమొచిత్రము. ఇచ్చట నున్నది కొండగాదు కేవలము డుత్పయునుంగాదు లోనబురబురగనుకు వినబడుచున్నది ఇదియొక కదలమెదలలేని యొకయెలుగుగొడ్డయియుం డునని తమలోఁదామనుకొనసమయంబున నచటనున్న యామౌని శిష్యుండు తనగురువును భ్రష్టాచారుండున కలుషించి "యో యిగంధర్వులారా! మీ దైవగమనంబునకు గర్వించి కిందుమీఁదు గానక మహానుభావుండగు మాగురు నిమ్మృగప్రాయునిఁగా మాటాడు చున్నవారు. మీగర్వమె మిమ్ములఁ జెఱుచుచున్నది నేఁటిమొదలు మీరం డఱు నాలుబిడ్డలుసహా మృగంబులై యారణ్యములఁ దిరుగుచుండుఁడు" అనికఠినంబుగాఁబలుక నాతనికి గంధర్వులునమ్రులై "మేము తృణీకారభావంబున ననలేదు అమాయకంబుగా నిట్టులనఁబడినది కనుక మమ్ముక్షమింపు" మనవుడు "వాఁడు నా వాక్యంబమోఘంబు బ్రహ్మలిఖితమైన నొకప్పుడు తప్పవచ్చునుగాని నాశాపంబు దప్ప"దనెను వారుమోక్షణంబుఁ బ్రసాదింపుమన నాతండు మీరెల్లరు కళ్యాణపురపరిసరారణ్యంబున మృగంబులరై తెలుగు బొమ్మయ్యచే వేటాడంబడి మీరుమీగంధర్వతనులంబడసెదరు. పొండ"నవారు తత్క్షణమ మృగజన్మంబులనొంది పూర్వజ్ఞానసంపన్నులై యెప్పుడు బొమ్మయ్య వచ్చు నెప్పుడు మనకీశాపవిమోక్షణం బగునని యెదురుసూచుచుండ

టు రెండు చెక్కలగునటులగా ఖండించి పాఱవైచెదను. నీవంటిమూర్ఖులిం
దున్నఁ బ్రయోజనము లే”దని వానితోఁ గఠినముగాఁ జెప్పెను. అంతనా
జైనుఁడు చిఱునవ్వునవ్వి “ఓయీ మూఢుఁడా! నీమూఢభక్తి విడువుము.
జ్ఞానమార్గము నవలంబింపుము. ‘నిస్త్రైగుణ్యే పథివిచరతాం కోవిధిః కోని
షేధః’ అనెడు శంకరసూక్తి వినలేదా? మేము గుణరహితులము. గుణా
వలంబకులము గాము. గుణాతీతులము. మాగురుబోధ నీవు వినలేదు
కాఁబోలు! మేము విగ్రహారాధన సేయము. మాది కేవలము సమాధ్య
వస్థనుండు ధ్యానమతము. మనోనైర్మల్యము ప్రధానము గాని, బాహ్య
నిర్మలత్వమేల? పాకుడుపట్టినపాత్రకు బైని తోమి శుభ్రపఱచినటుల నె
నీ బాహ్యపవిత్రప్రవర్తనంబును. నీవంటి మూఢభక్తుఁ డొకఁడు చెప్పుకాలి
తో నీశ్వరునిపైనున్న నిర్మాల్యముఁ దీసెనని వింటిని. నీ వెఱుఁగవా?
భ్రాంతిలేక నిశ్చలమయిన మనసుతో నేమి చేసిన నది యెల్ల జనసహ్యమ
గును. ఇంతకు శివాలయంబునకు నీ యధికారమేమి? ఇది సర్వజనగ
మ్యంబు. ఎవరి భక్తిమార్గము వారు పోదురు. మా భక్తిమార్గమిదియ.
ఇట్టి నీ చెడుగును సహింపుము. కాదేని నీతల నీశ్వరార్పణము సేసి
ముక్తిఁ బడయుము. అట్లైన నీ సాహసము నీశ్వరుని ఘనతయు లోకంబు
నకు వెల్లడికాఁగలదు” ఇట్లని జైనుఁ డనునంతలో నేకాంతరామయ్య
“ఛీ! వీని జాపుట యెంతపని. కానీ, నీకు తల శివునికిచ్చి ముక్తిఁ బడ
యుమనెను. అరె మూఢ! ఒక్క సారి నాశిరంబు ఖండించి హరాయని
సమర్పించి మఱల మొలిచిన శిరంబు గలవాఁడనై వీని చెప్పుడు నిర్మధ్వంసం
నెవ్వరును నన్నాటంకపెట్టరో”యని మనంబుననుకొని వానిం జేరి యిట్ల
నెను “ఓరీ! జైనాధమా, నీవు కోరినదియొక మిక్కుటకార్యము కాదు.
శివభక్తులకసాధ్యములు లేవు. శిరమిచ్చి తెచ్చుకొనుట యొకగొప్ప కాదు.
తొల్లి జంబూనగరమున నొకభక్తుఁడు, మహాకాళుండను పేరుగలవాఁడు
మహాకాళుండగు శివునికి శిరము సమర్పించి తిరిగి పొందలేదా? అవ్యార్త

గోవిందభట్టునాఁబడు నొకభక్తుఁడు విని తలదేవునికిసమర్పించి మూఁడు నాళ్లకు వేఱొకతలను బడయలేదా? అదివిని మొదట దవంకయ్యయను నొకభక్తుఁడు నవ్వి "ఆ! యిదియేమివింత నఱుకఁబడిన తలమూఁడునాళ్ల

మొదట దవంకయ్య తనతలనఱికి శివునికిచ్చుట

కాతిరిగి మొలచుట! ఈమూఁడుదినములు శివుడచట లేకుండెనా? నఱుకఁబడిన తలగలమొండెము సచ్చికుళ్లలేదా? నెంటనే మొలువవద్దా? అయినను భగవత్ప్రసాదము సేసినతలను మఱలఁగొనుటగూడునా? నేనట్లు గ్రహింపను. మాతమిచ్చినతలలు భగవంతుఁడు మొలిపించునో" అని యెల్లఱుఁజూచుచుండఁ దనతలఁగండ్రకత్తెంబచేఁ జుఱుక్కునఁగత్తిరించి శివునిపాదంబులపైఁ బడవైచినఁ దక్షణమునటియొకతల మొలిచెను. దానిందిరిగి ఖండించెను తక్షణమునటియొకటిమొలిచెను. దానినిసైతముఖండించెను వేఱొకటియప్పుడమొలిచెను ఇట్లుమొలిచినకొలఁదిఁ దలలనఱుకుచుండెను నఱికినకొలఁదిఁదలలు మొలచుచుండెను ఇట్లునఱుకుటకు భక్తుఁడువిసువలేదు. నఱుకఁబడినతలలుభూమిపైన కుప్పకుప్పలుగాఁ బడియుండెను. ఎప్పటికప్పుడు మొలిచినతలయొక్కటి యట్టపైట్టిరూపులఁ జూచుచుండెను భక్తునిచేనఱుకఁబడిన లెనతలలు నజీవంబులై యీశ్వరసన్నిధిని నిలువంబడి నవ్వుతలయు, వెక్కిఱించుతలయు కలువఁబోవుతలయు పాదములపైఁబడుతలయు శిరంబునునిలుచుతలయు ప్రదక్షిణమాచరించుతలయు దండమిడినటుల నేలకొఱుగుతలయు స్తోత్రముసేయుతలయు పరిహాసోక్తులువలుకుతలయు నై యనేకవిధంబులనుండఁ దుదకునొకతల పార్వతిపాదంబులకు మ్రొక్కి "అమ్మా! చూచితివా, యీయయ్య సామర్థ్యము. నఱికినకొలఁదిఁదలలు మొలిపించుచున్నవాఁడు నిర్లక్ష్యముగావాఁడు నఱుకుచునెయున్నవాఁడు తుదకు మేమీఘోరకృత్యముఁజూడలేక విసువుకొనుచున్నాము గానియాభక్తునికిని భగవంతునికి విసువుదలలేకయున్నది. నీవైన ఏరలపంతంబులు

మాన్పంపవే తల్లీ!" యని మొఱవెట్టెను. అప్పుడులోకమాతయగు భూతే శునితో "మనభక్తునితో మనకింతపంతమేల. భక్తుఁడుమతప్రియుఁడు. నిజముగఁగన్నతనయుఁడు. 'పుత్రాదిచ్ఛేత్పరాజయ'మ్మని తమకెఱుంగదే? ఇఁక నీతలకాయలనెల్ల నంతర్ధానంబుసేసి భక్తునితో నీకునేతోడిటనని చెప్పిమందలించి వానిశిరంబుతో వానినుండుమని నియోగింపు"మని మనవిసేసెను. మనోనాయకివాక్యంబును గారవించి యక్కాలకంఠుఁడు వాకొనుచుచేయువట్టి మఱిఖండింపనీక నీకునేనోడితినని యతని తలలన్నియుఁ దనశరీరమున నంతర్ధానంబును సేసి నీభక్తినిదలఁచిచూడ నాకలవిగాదని నిజపరాజయంబు గీకరించి భక్తుని సమాధానపఱచె. చూచితివా, జైనా! భక్తులసామర్థ్యము. అదియునుంగాక భయంకరాకారులగు ననేకుల మీజైనులను మాభక్తులు పఱదోలిన చరిత్రలు గలవు చెప్పెదవినుము

## తిరునావుక్కరసి కథ

తిరునావుక్కరసియను నొకజైనమునియుండెను. అతని కాకస్మికముగా నొకశూల (కడుపునొప్పి) పుట్టెను. అదియెన్నిమందులు తినినను కుదురలేదు. లోకమునఁగల మందులు మాకులు మంత్రములు తంత్రములు కడుపునొప్పిని మాన్పలేదు. ఓర్వలేక యాబాధపడుచుండు నాతనిసోదరి వచ్చిచూచి శివమంత్రప్రభావంబున శివభక్తులాదరమున నిచ్చు తీర్థప్రసాదముల నీశూలయడఁగును గాని, యన్యథా దీనికి నివారణోపాయంబు లేదని యన్నకుబోధించి యతనిని శివభక్తిపరాయణునిఁ జేసెను. అతండును చెలియలిమాటలు గైకొని శివభక్తులశరణుసొచ్చి వారిపదరజంబు శిరంబునఁదాల్చి వారిచ్చిన తీర్థప్రసాదంబులు గైకొనినంతలోఁ దనబాధమాని యనాయాసంబున నిరామయదేహుండై చెల్లెలింబిలిచి "నీకతంబున నాశూల నివారణమైనది. నేను బ్రతికితిని. ఇఁక నేసర్వదా శివభక్తుఁడనై దాసానుదాసత్వంబు దానున భక్తులసేవయు

నొకనాఁడు శివపూజార్థంబు బిల్వపత్త్రికొఱకు నరణ్యంబున కేఁగి నా తని గని మృగంబులు "ఈతఁడె బొమ్మయ్యగా నోపుఁ గాకేని వీనిఁగని న మనకు నానందము పుట్టుచున్నది" యని యనుకొనునవసరమున నందొకవృద్ధమృగంబు బొమ్మయ్యపాలికిం జని దండము పెట్టి "అయ్యా మేము గంధర్వులము ఒకమునికుమారుని శాపవశంబున నిట్టి హరిణ జన్మలమై మృగరూపంబులఁ బడియుంటిమి మాకు శాపవిమోచనంబు గంటె. నీచే హతులమై మాకుణంబునొందెదము ఇదియె మాకు పరమావధిగా నాతండు నియమించెఁ గావున మమ్ముఁ బరిమార్పుము నా కూటనిజమనుట కొకనిదర్శనంబు గనవలెను పెఱవేటకాండ్రకు మేము దొఱకక నీచేతియాయుధపాతంబునసె యీ దేహంబులం విడిచి దివ్యదేహులమై ఖేచరగమనంబునఁ గైలాసమార్గంబున నరిగెదము. కనిపెట్టు" మనవుడు బొమ్మయ్యయు నిజయోగదృష్టిచే సర్వంబును సత్యంబుగా నెఱింగి నల్లెయని పురంబునకుం జని మఱునాఁడు వేటకాండ్రం బిలిచి "రేపు మనము వేటకుం బోవలెను మనపురంబునఁగల వేటకాండ్రసంఘము బిలువుఁడు రావివారల దండింతునని డప్పువేసి చాటింపించి తానును చిత్రసాయుధములధరియించి పచ్చంట్టుపంచగట్టి ఖండువా మీఁదవైచి తమతమ సన్నాహంబులతో వేటకాండ్రు తోడనడువఁ జనిచని ముందటఁ సాలరసాలతమాల హింతాలాది వృక్షజాతంబులతోడను హంసకారండవాది జలవిహంగమములతోడను విలసిల్లు సరస్సులతోఁ దులఁదూఁగు నయ్యరణ్యంబుఁ గని మృగయావినోదంబునకుం దవిలివేట కత్తరువీయ వారలు కుక్కలగొలుసులువిప్పి వదలి యాయుధంబులనేయ సమకట్టిరి ఒక్కమృగమైనను దొఱకక బొమ్మయ్యకడ్డదిటికిఁ బోవుచుండెను అతండు గురిపెట్టి వానిం గూల్చుచుండెను. ఇట్లు తమచేత నొకజంతువైనను దొఱకకపోవుటయు నవియెల్ల బొమ్మయ్యచేతఁ జచ్చుచు వెంటనే దివ్యరూపంబులు దాల్చుచు ఖేచర

గమనంబులఁ గైలాసంబునకేగుట వారుచూచి యవికారణజన్మమృగ ములని యూహించిరి బొమ్మయ్య దినమునకేడేసిమృగంబులఁ జంపి శివ పురంబునకనుపుచుండ బొమ్మయ్య వేఁటాడురీతిఁ జారులవలనవిని రా జును బసవేశ్వరులును గలిసి యరణ్యంబున నాతనివేఁటసూచి యరుదం దుచుండిరి అప్పుడు బసవేశ్వరులు రాజుతోడను పురజనులతోడను "గురుధ్యానమను బిండివాలమున సంసారసింహంబును బరిమార్చి భక్తి సమాధనమను ముద్గరము పూర్వజన్మ దుష్కృతములను భల్లూకముల నడంచి గుర్వాజ్ఞయనుఖడ్గంబున శ్రమపుండరీకంబు నాశంబుతో ని ర్మూలంబు సేసి సుజ్ఞానమను దీర్ఘాసిచే నజ్ఞానమను వరాహంబుగ్రుచ్చి యెత్తి భక్తియనుతోమరమునఁ బ్రపంచమాయ యను మనుఁబోతు ద్రుళ్ళడంచి నిత్యప్రసాదంబను వింటి నింద్రియంబులను వేళ్లను పాఱఁ దోలి నిర్మలశివనామస్మరణమను కిరాతుచే లోకజాలంబను మిండగాని గండడఁగించి భావప్రాప్తియను నీపనత్రయమును హారమహిమయను పట్టణంబున, పరమతవాసులను మృగంబులఁ జంపి యిట్లు బహిరంతరస్థ గయావిహారుండగు బొమ్మయ్య కాటవీమృగంబుల నరనిమిషంబులో డనుముట యొకయాశ్చర్యమా? వేదను బ్రకృతిననుసరించి దినమునకే డేసి చంపెను" అని బొమ్మయ్య మహాత్మ్యంబుం గొనియాడుచుండ బొమ్మయ్యయును యథాస్థితిం గనరె. ఈబొమ్మయ్య చరితంబుఁ జదువు వారు విన్నవారు వ్రాసినవారు శాశ్వతసుఖసంపదల ననుభవింతురు.





# బసవపురాణము.

## షష్ఠాశ్వాసము

—— ० ——

### ఏకాంతరామయ్యకథ

మఱియు మహామాహాత్మ్యశాలియు యథావిధి సదా సమర్చిత శూలియు, జైనమత మేఘపటల ఝంఝామారుతుండును, జితేంద్రియుండును, భువిసంస్పర్శనమాలాపాది వ్యాపారదూరుండును నిర్భీతుండును, పరమతావలక ప్రహాణగుణగోచరుండును రౌద్రరసవీరభద్రుండును వీర శైవమార్గప్రచారుండును శంభుపదసేవానావధానుండును రహస్యభక్తి సంయుక్తమానసుండును ధైర్యశౌర్యౌదార్యగాంభీర్యాది సమస్తగుణ గణోపేతుండును స్వచ్ఛందయోగమార్గగమనప్రవీణుండును నగు నేకాంత రామయ్య యనుభక్తుండొకండు గలండు అతఁడు ప్రతిదినము శివపూజా నంతరము ప్రమథగణలోకంబునకరిగి వారలతో నిష్ఠాగోష్ఠినుండి మఱి ల పూజాసమయంబునకు భూలోకంబునకేతెంచి, పూజానంతరమున దిరిగ యచ్చోటికి నేగి యీప్రకారంబున నిత్యత్రికాలశివపూజాసమ యములందు భూలోకమున శంభుపూజాసక్తుఁడై, తదితరకాలము ల నుగ్రుని ప్రమథగణలోకంబున తద్గోష్ఠినుండుచు నుభయలోకంబు లకు గమనాగమనంబులు యథేచ్ఛగాసలుపుచుండును ఇట్లుండ నొక నాఁడు చంద్రహాసుఁడు భూలోకమున నడుగంటిన శివభక్తినిమఱల నుద్ధరించి వృద్ధిసేయుమని నందికేశ్వరు నియోగించి యంప నతండు బసవావతారంబునఁ గళ్యాణపురంబున బిజ్జలరాజుమంత్రియై యున్న వాఁడని యాతనికీర్తిప్రతాపంబులువిని తద్దర్శనార్థము కల్యాణకటక మున కరిగి తనరాక బసవేశ్వరు లెఱుఁగక మునుపె యొకదేవాలయం బున కేగి యందుశివలింగ దర్శనస్పర్శనపూజాధ్యానాది క్రియాలోల

త్వంబునఁ గొంతప్రొద్దుపుచ్చి బయటవచ్చునవసరంబున నొకశైవుఁడు శివాలయంబులోనికిఁ జెప్పుకాలితోఁ జనుచుండఁ జూచి "యోరీ మూర్ఖా! పాపాత్ముఁడా! పశువా! యేమిరా నీయాగడము. చెప్పుకాలతో నాలయములోని కేగుచున్నావు ఛీ! భక్తిహీనుఁడా! నీముఖముఁ జూడరాదు తక్షణమీ జోడవతల విడిచివచ్చి స్వామికభిముఖముగా నేలనొఱఁగి సాష్టాంగదండంబు వెట్టి యోయీశా! యభవా! నేనజ్ఞుండను మూర్ఖుఁడను నేనెఱుఁగక సేసినయీపాపమును క్షమించి నన్ను రక్షింపుము అని వేఁడుకొనిపొమ్ము అట్లయిన నీయెడల నీప్రాణంబులుండును. కానిచో నాచేతియీఖడ్గంబు జూచితివా? దీనితో నీశిరం నఱ్ఱుచు సద్గురుకటాక్షంబున లింగధారణంబు స్వీకరించి మనియెద"నని చెప్పి యావెంటనే పగలూరను (దీని కేయిప్పుడు కడపజిల్లాలోనున్న ప్రొద్దుటూరనుగుడు) గ్రామమునకుంబోయి యచ్చటనున్న యొకశైవగురుని గాంచి నమస్కరించి "దేవా! నన్ను మీకింకరునిగాఁ గైకొని నాకుశివజ్ఞానోపదేశంబు సేసి రక్షింపు" డని నిలుచున్న యాశైవగురుండగాంచి యాశైవగురుం డాతని గురూపగురుభక్తునిం జేయుచునట్టి తొలుదొల్తఁ బంచాక్షరీ మంత్రోపదేశంబు సేసి దాని యథావిధానంబున న్యాసపూర్వకంబుగా నుచ్చరింపఁ జేసి దీక్షయొసంగి పూర్ణకలశోదకంబుల నభిషేకంబొనర్చి లింగప్రాణగావించి యాతనిదేహంబు తల్లింగసంగతంబు గావించి లింగమయప్రాణుండుగా నొనర్చి పాంచభౌతిక దేహాభిమానంబుం జెడఁగొట్టి లింగదేహాభిమానం బుపదేశించి వాయుమయంబులగు ప్రాణంబుల చాంచల్యంబును పృథ్వీమయంబగు దేహంబుల యస్థిరతయు నగ్నిస్వరూపమయంబులగు క్షుత్పిపాసల స్వరూపంబును తన్నివారణోపాయంబులు నాకాశమయంబగు తృష్ణాగరిష్ఠత్వంబును శమదమాదుల దానినడంచుమార్గంబును జ్యోతిర్మయంబగు జ్ఞానదీపప్రభావంబును దానియఖండ తేజోవిరాజత్వంబును కామక్రోధలోభ

మోహ మదమాత్సర్యంబులను నరిషడ్వర్గనామకాంత స్వత్వస్థితియు జ్ఞానరత్నంబునపహరింప వారలార్గురు సర్వదా వేచియుండుటయు శత్రువులకుఁ దస్కరులకగమ్యంబగు దుర్గంబున ధనగుప్తియొనర్చి దానిఁగాఁపాడుకొనునట్టుల గృహస్థాశ్రమ దుర్గగుప్తిని జ్ఞానధనసంరక్షణోపాయంబును మఱియు ననేకంబులగు శివరహస్యంబులును దేటతెల్లంబుగాఁ దెలిపి యాత్మలింగార్చనా విధానంబులును వీరశైవులకు సర్వంబును లింగార్చనమేయనియు లింగదీక్షకన్న వేఱుదీక్ష లేదనియు లింగదేహాలింగప్రాణులే వీరశైవులనియు ననేకంబులగు తప్యాజ్యద్రవ్యవిశేషంబులును వేళావిశేషంబులును భక్తపరిపాలనలాలనాదికంబులును సవిస్తరముగాఁ దెల్పి యనల్పశివభక్తునిఁగా నొనర్చుటయు నాతిరునావుక్కరసియు వీరశైవుండై విభూతిరుద్రాక్షలు ధరియించి యథాకాలశివపూజలు గావించుచు భక్తులనారాధించుచు శివదీక్షాపరతంత్రుండైయుండఁ దక్కినజైనులు నీఁడు మనమతముఁ విడిచి శివమతము నవలంబించెను గాన వీని నేనుఁగు కాలఁ ద్రొక్కింతు" మని కాలుసేతులుఁగట్టి యేనుఁగు కట్టెదురఁ బఱవైచి యా యేనుఁగు నేనుఁగును డీకొల్పిన నది తొండమున వానినెత్తి యోరగిల నొకవారకమెల్లనఁ దొలఁగించిచనియెఁ గాని వాని మొదలికిఁ గించిత్తైన ధూళియుఁ బొందక నెత్తి మఱలమెల్లగ దిగవిడచెను గదా సురారిభక్తుల నొకసామాన్యగజం బెట్లు బాధింపఁగలదే? ఒక్క పర్యాయము చంపుదమని విషభోజనము బెట్టిరి అదియు జీర్ణమై శరీరమునకు మఱింత మెఱుఁగువకాంతిఁ గలిగించె విసపుమేతరిబత్తులకు విసమమృతంబు గాకుండునె? శిక్షింపక విడుతుమా యని యనేకకట్టియలం దెచ్చి యగ్నిఁ గల్పి మంటగావించి యాపెనుమంటలో వానిఁబడవైచిరి ఆమంటయుఁ జప్పనఁ జల్లారి యానిప్పులన్నియు నీరయ్యెను. అగ్ని దేవుని లలాటమున నేత్రముగా ధరించిన యాపావకాక్షుని భక్తులదహింప కాకి కాగ్ని కెట్లు శక్యత్వంబు వర్తించు? ఇఁక వీఁడు దేనను జావండు. "అగా

ధముగు బొద్దనబావిలోఁ బడవైతమని యట్లు గావించిరి. ఆబావిలోని నీరంతయు నింకి యందున్న రెండు గొప్పనాగుఁబాము లొకఁడానిలోఁ కనొకటి యంటఁగరచి పట్టి గట్టుననుండి యడుగువరకు నిచ్చెనత్రాడు వలె వ్రేలాడుచు నాతనికి దృగ్గోచరంబయ్యె. వాఁడా త్రాటినిఁబట్టి పయికెక్కి వచ్చి మఱల వారలకు శివబోధ యొనర్పఁజొచ్చెను. మహా గంగ జటాజూటమం దిమిడ్చికొని దానిచుట్టును నాగపాశమును శిగపాశముగాఁ జుట్టుకొన్న యాఁగట్టువిల్తుని దాసులకు కూప గంగ యడంగునుగాదె? మఱియు నాగపాశుని భక్తులను నాగపాశమె రక్షించును గాదె. ఇచట నాగపాశ మెవానిని పయికెక్కించెను. ఇట్లెన్ని మారణోపాయములను వాఁడు చావకుండుటఁజూచి వారెల్లరు "మనమింతింతలుగాని మహామారణ కృత్యంబులఁ బఱఁగించియు నాయించు విలుకాని దాసానుదాసునిఁ బంచత్వంబు నొందింపఁ జాలమైతిమి. ఇఁక వానికిఁ బరమభక్తులమై వాని మతమునె యవలంబించి కూడియుండుట మనకును శ్రేయస్కర" మని వారందఱు నమ్రులై చేతులుసాచి శిరంబును వంచి సాష్టాంగ దండంబులువెట్టి వారల జైనచిహ్నంబులు విడనాడి శివచిహ్నంబులు ధరించి శివభక్తులై వానితోఁగూడి సంచరించుండిరి.

ఇట్లు బహుజైనుల శైవులఁజేసి జైన సమయ కోలాహలుండను బిరుదంబు వడసి తిరునావుక్కరసి మహాశైవ మతోద్ధారకుఁడై తానొక మతబోధకుఁడై తన జైన శివభక్తగణంబులోఁ బ్రమదగణంబుతో బైలువెడలిన సాక్షాచ్ఛంభుండునుం బోలెఁ బయలువెడలి యనేక నిదర్శనంబులు మహాత్మ్యంబులు ప్రజలకుఁ గనఁబఱచుచు మతబోధకుఁడై యొక యాశ్రమంబు గల్పించుకొని యొకమతాధికారియై యుండె. వింటివా, జైనాధమా! యీ జైనమును పడిన యవస్థయు మఱల

శివభక్తానుగ్రహంబున వాని మహోన్నత దశయు. నీవు నల్లియుగు మని చెప్ప యేకాంతరామయ్య మఱల నిట్లనియె.

### తిరువదాందారి కథ.

ఓరీ ! వేఱొకయాశ్చర్యముచెప్పెద వినుము. తిరువానూరను గ్రామమున నొకభక్తుఁడు బాల్యాంధుఁడు సదాశివాభిషేకరతుఁ డిరువ దాందారియనువాఁడు తనభక్తిరసంబు వెల్లిగొన నభిషేకార్థము నీరు మోపితెచ్చుటకు గ్రుడ్డివాఁడగుట నోపికలేక శివాలయముప్రక్క నొక బావిత్రవ్వకొందుమని నిశ్చయించుకొని తట్టయుఁబాఱయుఁగొని శివాలయంబుప్రక్క నొకయిమ్మగుతావు నేర్పఱచుకొని మన్నుద్రవ్వనారంభించి త్రవ్విన మన్ను దూరముగా మోసుకొనిపోలేక చుట్టునుగట్టుగా వేసుకొందునని యూహించి తానావరణగావించిన బావిప్రక్క నొక రాటయు లోన నొకరాటయుఁబాతి యారెంటికి నొకత్రాడుగట్టి యా త్రాటియానవాలున దానింబట్టి యదేదారిని మన్ను మోయుచు బైట తట్టతోఁజిమ్ముచు నిట్లు మిగులనోపికతోడను శ్రద్ధాభక్తులతోడను నాయి ద్రవ్వుచున్నవానింగని జైనులనేకవిఘ్నములు లేచి యవివిఫలంబులగుట నారాటలనూడఁబెఱికి త్రాటిని నఱికి బైటఁబాఱవైచిన నా యంధభక్తుఁడు మిగులఁగోపించి భగవదనుగ్రహంబునఁ బ్రత్యక్షదృష్టి బడసి జైనులనెల్లం బాఱఁద్రోలి వారివసతులమూలనొఱుఁగఁజేసిన యి తిరువదాందారి యాశ్చర్యచరిత్రమును వినలేదా ? వినకున్న నిపుడువింటివికదా ! ఇకనైన బుద్ధిదెచ్చుకొని బ్రతుకుము. మఱియొకచిత్రకథఁ జెప్పెదవినుము.

### వళ్లనైనారునకు పార్వతిపాలిచ్చిన కథ.

శ్రీశాలిక్షేత్రంబున నొకశైవబ్రాహ్మణునికి నీశ్వరపుత్త్రుండగు కుమారస్వామియంశచేత జనించెనను ప్రఖ్యాతిగల యొకచిన్నవాఁడుపుట్టెను. వానికిఁ బిళ్ళనయనారను పేరువెట్టి తలిదండ్రులు మిగులగారా

బమునఁ బెంచుచుండిరి. ఒకనాఁడు తండ్రియాబిడ్డనెత్తుకొని యొకసరో వరతీరంబునకుఁజని తనయునట తటంబునఁ గూర్చుండఁబెట్టి తానులో నికిదిగి స్నానమాడుచుండెను. ఆకాశమార్గంబున నాటీతివిమానంబు నఁ బార్వతీపరమేశ్వరులు భూలోకవిహారంబు సేయుచు నాసరస్సునొద్దకు వచ్చిరి. పార్వతియాచిన్నవానింగాంచి వానిని సుతప్రాయంబుగాభా వించి భర్తంజూచి “స్వామీ! యాచెరువుగట్టున నాడుకొనుచున్న పిల్లవానింగాంచితిరా? వాఁడుమన కుమారునాకారంబున నామనం బునకుఁ గనిపించుచున్నవాఁడు. వానింజూడనాకుఁ బాలిండ్లఁబాలుచే పుచున్నవి. ఒక్కపర్యాయము వానినెత్తుకొని ముద్దాడిపాలిచ్చి వైళం బిమళ్ళివచ్చెదను. అంతదనుక తమకీవిమానంబునిచట నాపుఁడు.” అని ప్రార్థించి వేగదిగివచ్చి యాపాపనెత్తుకొని శిరంబుమూర్కొని యద్దాలనిడుకొని పాలిచ్చి యంతఁబోక యొకసువర్ణపాత్రంబునఁ గొన్ని పాలుపిడికియిచ్చి మఱలిపోయి విమానంబెక్కి భర్తృసాన్నిధ్యముం బొందెను అంత స్నానంబు సాలించి కొలను వెడలివచ్చిన తండ్రి మొగ ము నాంగ్రించుకొని మిగులఁగోపముతో 'నోరి! నీకీపాలముంత నెవ రిచ్చిరి? నీకుఁబాలిచ్చిచన్న యామగువయెవ్వతె? తెలియనిపాలఁతుల పాలట్లుత్రాగవచ్చునా? ఎవ్వరేమోనమొనరింతురో. ఇప్పుడునీకుఁ బా లిచ్చిన యావాలుఁగంటిం జేర్కొంటివేనిసరి లేనిచో నాచేనీక్షణము నీవుమడిసెదవు” అని యత్యుగ్రదృష్టితోఁ దన్నడుగుచున్న జనకునకుఁ దనయుండు భయముచేవడవడవణఁకుచు “నాయనా! నాకున్నమ్మయి చ్చిన యామచ్చెకంటిఁ జూడుము. అదిగో! విమానమింకనక్కడ నేయున్నది. ఆపరమేశ్వరునియర్ధాంగమున దేదీప్యమానమై వెలుంగుచున్న యాయుంగనంగుర్తింపుము. ఆమెయేనాకుఁ బాలిచ్చినది. ఆలోకమాత యే నాకుఁబాలిచ్చి నాదేహంబు లింగసంగతంబు సేసి కొన్ని సంగతులు చెప్పి సనియె” నని కొడుకు చెప్పునంతలో నాపుడమిఁవేల్పు విమానంబు

ను దానియందున్న పార్వతీపరమేశ్వరులను కన్నులారఁగాంచి నేలనుం డివయె వారలకునమస్కరించి యందుఁబార్వతికి మఱిమఱి మ్రొక్కి యక్కొమరునంసపీఠంబున నెక్కించుకొని నిజాలయంబునకుండని జరిగి నవృత్తాంతంబంతయు నేకాంతంబున దనయింతికిం దెల్పి యిద్దఱు నమం దానందంబున నందనునతిప్రేమమున బెంచుకొనుచుండిరి. పార్వతిస్త న్యపానవిశేషంబునం వానికి జ్ఞానోదయంబయ్యె.

అంతనొక్కనాఁడు రెపకడనబ్బాలుండు ఖండపరశునాలయంబు నకుఁబోయి యటభక్తిపారవశ్యంబున నాడుచుబాడుచు గంతులువైచు చు నీశ్వరునుతించుచున్న వానికిఁ బార్వతియొకనురియయు నొకసువర్ణ మయమగు తాళములజతయు నిచ్చిన నాసూరకత్తిని ముఖమొలనుధరించి తాళమువాయించుచు నారదాదులగానంబును మించురాగజ్ఞానముతో గానంబొనరించి యీశ్వరునుతించిన నాతండునుబ్రీతుండై యసమాన హేమసింహాసనంబును ముత్యాలపల్లకియు శ్వేతచ్ఛత్రము నక్షయనిధి యునొసంగెను.

ఇట్లాపళ్ళనయనారు శంభునివలన దినపడసెనయుండలంబెక్కి య క్కజంబగు మొక్కవ్రాని ధైర్యగాంభీర్యాదార్యాదిగుణంబులచేతనై సక లవిద్యాపరిపూర్ణుఁడై భేరీకహళాదివాయిద్యములతో సంచారంబ్రారం భించి యుత్తుంగచోడుని శివభక్తునిఁజేసి రెండువేలబౌద్ధులను శైవులు గామార్చి వారలచేసేవలనందుచు జైనమతస్థులకు తలలువంచునట్లుచేసి మధురానగరపురాజుభార్య శివభక్తురాలగుటఁ నామెపిలుపింప నచ టికేగెను.

అప్పురంబుననున్న జైనబౌద్ధులందఱుఁగూడి రాజసముఖంబు నకుంబోయి "రాజా! జ్ఞానసంబంధియనుపేర నొకబాలుఁడువచ్చి వేద బాహ్యులరని మనలదూషించుచు బౌద్ధులనాశంబు దెలుపుధూమకే తువవలె పల్లెలోవిత్తుమీఁగుచు దిరుగుచున్నవాఁడు. వానినెట్లైన నూరువెడల

గొట్టవలె" నన్న రాజును దూరమాలోచించి ప్రజలంగని వారలనోదా
ర్చి "యుత్తుంగ వోడుని గురువట యాపిల్లవాఁడు ఎంతవాడుగాక పో
యిన నంత రాజునమ్ముఁడగును. అట్టివానినైనను వాదమునవోడించిపం
పుటయొప్పుగాని యూరక యెట్లుపంపనొప్పు" ననియెను.

అంతఁ బదునెనిమిదివేల జైనమునులాతనితో వాదించి యోడి
పోయిరి. వారావేలుమొగంబులతో చాటకువచ్చి యాతని వంచించు
నుపాయంబుగానక యర్ధరాత్రిమున నాతనిచిన్నయింటికి నగ్నిదగిల్చి
దానిఁ బరశురామప్రీతిగావింపనిశ్చయించుకొని రాత్రియగుడు నిట్లనే
మండుచున్నకొఱవి దెచ్చి యాతనియింటినడి కొప్పునఁబెట్టిరి. అయగ్ని
యునాతని గృహంబు దహింపనోల్లక ముందఱవచ్చి నిల్చినఁ
జూచి "యోహవ్యవాహనా! నా గేహంబు దాహంబుఁగావింపవచ్చి
తివా? యనియాతండుపలుక నగ్నిదేవుండును చేతులుజోడించి "స్వామీ!
నే నట్లుసేయనోపుదునా? మీ ప్రభావంబునాకుఁ దెలియదా? తొల్లిదక్షా
ధ్వరవిధ్వంసనంబొనర్చు వీరభద్రుండు మదీయజిహ్వలుగోసి నన్నువి
హ్వలుంజేసె నాతనియనుంగు సోదరుండవగు కుమారుఁడ వీవగుట నే
నెత్తెంగియె భవదీయగృహదాహకకృత్యంబున కొడంబడక మీయాన
శిరసావహించి నెరవేర్పవచ్చితిని (సెలవి..."యని భయభక్తులతో నిలు
చున్నయనలునిగని" యోదహనా! నాశక్తిసామర్థ్యంబుల వెనుకటిగాఁ
దలఁతువుగాని యిప్పటికీ భూపాలుదేహంబును బొంది యాతనికిఁ దా
పోద్రేకంబు గలిగింపుమూ"యనెను. అంత నాహుతాశనుండా రాజు
మేన మిత్తిలేనిమంటలెత్తింప బాధకుఁదాళఁజాలక తేఁడు కుయ్యో
మొఱ్ఱోయని రోదనంబుసేయ నాతని భార్య మంగయక్కగనిరాజాజ్ఞ
వడసి జ్ఞానసంబంధించి బిలిపించి రాజుతాపంబుఁబాపుమని నాతిల్లనయ
నాదిట్లను. "ఈ మూగినజైనులందరు నొకయెత్తు నేనొక్కరుండ నొక
యెత్తు ఈభూజాని సర్వాంగంబుల దేహమంతయు వ్యాపించిన యీ

బాధ నగము శేమాస్పదఁ దక్షిణనగము మీరు పోఁగొట్టుఁ"డని నీరు మంత్రించి యారాజునొడలికి దక్షిణభాగంబునకు లేపనంబు సేయించిన దక్షిణముయామంట తెత్తుటమాని యా భాగంబు నీటఁ దేలినటులఁ జల్లగానుండె వామపార్శ్వమంతయు నింతింతనరానిపొగలేని మంటమండుచుండెను. అప్పుడుజైనులందఱు నొక్కుమ్మడిఁదమతమ మంత్రంబుల జలంబులుమంత్రించి ప్రోక్షించి తుదకు శుద్ధిస్నానంబు సైతముఁగావించిరి మంట వినుమడింబెఱుఁగు మండెను. తుదకు నెకిమీఁదు జైనులందఱు వినుచుఁ గనుచునుండఁగ్రైదోయిసంధించి "పల్లవయనారీ! నీవుమహానుభావుఁడవు సామాన్యమానవ బాలకుఁడవుగావు పార్వతీప్రియసుతుండగు కుమారస్వామివే నీవు నాఁడు కృత్తికలుగని విడిచిన యాపదాననుం బరమేశ్వరిగాంచి చేరఁదీసి పాలిచ్చి తత్క్షణమసమగ్రవయో విశేషుంగావించి యఖండదైవత్వంబొసంగి యాతని దేవసేనానింగావించి వానిచేఁ దారకాసురుంజంపించెఁగాదె? నేఁడట్లనె యొక సామాన్యజైనమతస్థుఁడగు శాపనయ్యకు నర్భకుండవుగా నుదయించిన నిన్నుఁ గని నీకుఁబాలిచ్చి జ్ఞానవంతుంగావించి యమగంటిన శివభక్తిని నీచే మరలభూలోకంబున నెలకొల్పఁడలంచియె యిట్టిమహానుభావంబు నీకొసఁగినది. నీయాజ్ఞనాయగ్నిదేవుఁడై శిరసావహించినపుడు నే నెంతటివాఁడను. నాబాధమాన్పి నన్నురక్షింపు"మని పరిదేవనంబు సేయఁగ నికరించి భస్మంబు మంత్రించి యాతనిదేహంబున వామభాగంబునకు బూయించినఁనదియుఁ జల్లనయ్యె. అంతనా భూపతియు, నాతని సతియు పిళ్లనయనారునకు సాష్టాంగదండంబు లాచరించి యాతనియాజ్ఞ శిరంబునందాల్చి శివమతంబవలంబించి లింగధారణంబుఁ బొంది వీరశైవులైరి. అవుడుపిళ్ళనయనారు జైనులనెల్లఱఁగాంచి "యింకనుమమ్ము మాఱ్కొనఁజాలెడువార లున్నయెడల శీఘ్రముగముందుకుఁ గడంగుఁడు మీమీమానంబుల నిప్పుడవమానంబులఁగావించెద"ననియెను. అందు

కాన్జైనులు లేచి "అయ్యా! మాకును మీకును మాటలువేయేల? ఒక్కటేశపథము వినుఁడు! మాచిన సర్వజ్ఞనామమును మీశివనామమును వేఱ వేఱఁ జీట్లపైఁ బంచాబ్దంబులబాలకునిచే వ్రాయించి యగ్ని ముఖంబునఁ బడవైత మందుఁగాలినవి మోశినవి. కాలకున్నవి గెల్చినవి దీనికి మీరొడఁబడెదరా?" యనిరి

అంతట పిళ్ళనయనారు "సరే! దానికేమియు సందియము లేదు. కుక్కపల్లు బంగారు రేకున రాచినమాత్రమున బంగారు రేకు యైన వెలితివచ్చునా? కావడిభారము సరివెట్టుకొనుటకు నొకటిలఁ బాలును రెండవతల తాయియుఁ బన్నిన కానటిబరువులో తాయి తాయియుఁ బాలుపాలునె యగునుగాని తాయిపాలగునా? అట్లనె జిననామము శివనామమగునా? కానిండు! మీరుకోరినట్లె సేతమ మని యొకబాలునిచే శివ జిన నామములు రెండును రెండు తాటియాకు తునకలపై వ్రాయించి రాజుచేతి కియ్య నాతఁడది యగ్నిముఖమునఁ బడవైచెను. తత్క్షణమే జిననామమున్న తునక చుఱచుఱ గాలిపోయినది. శివనామమున్న తునక కాల్చిన బంగారు తేకువలె మఱింత వన్నెదేరినది. అదిచూచి జైనులు తలచచ్చి తోఁకచావని పామువలెఁ దోఁకలాడించుచు "అయ్యా! యొక పందెము నందేమి గలదు. మూఁడు పందెములు గెలువవలెగదా. యీసారి యాతీరుననె వ్రాయించి కావేరీ ప్రవాహమునఁ బడవైతము పాఱిపోయిన తునక యోడినది. యేటికెదురీఁదుతునక గెల్చినది." అనుటయు "నట్లనె కానిం"డని మఱల నొక బాలునిచే జిన శివనామములు వ్రాయించి కావేరికిం జని యందుఁ బ్రవాహమధ్యమునఁ బడవైచిరి. జిననామమున్నయాకుముక్క మీఁదమీఁదనే తేలుచుఁ బ్రవాహము వెంబడిని పాఱిపోయెను. శివనామమున్నతునక కప్పదాట్లువైచుచు నేటికి నెదురీదుచుఁ జనుచుండెను. చీల్లుగొని కావేరికి బోవునపుడు పళ్ళనయ

నారు రాజుంగని ॥ఓరాజా! మీజైనులసంగతి నాలోచింప నన్ను గొట్టినవాఁడవు మాయన్ననుఁ గూడఁగొట్టుమా చూతము కోమటి చందంబున నున్నది. వీరాడినదాట పాడినదిపాట యగుచున్నది. వీరే యేశపథంబులఁ గోరుచుందురో వానికెల్ల నేనొడబడుచుండుట వలన నీర లింకయు నెన్నెన్నో యిట్టిమాయోపాయమును పన్నుచుందురు. ఎన్ని జైనులమాయలు మంత్రములైనను శంభుమంత్రమునకు సాటి కాఁగలవా? కనుక యీసారి శపథమేమన నోడినవారు శస్త్రలోహ శూలంబులం గొఱ్ఱతలువడుటయె యని యొప్పించినవాఁడగుట నటుల నేటికెమరిదు శివనామముగల తునకల తునకలం దీయించి తనజయము బొప్పించి వారల పరాజయంబు స్థిరపఱచి పనునెనిమిదివేల జైనులనం తకు ముందు నిడియాలను రాజుసేయించి యుంచిన సూదిమొనగల యినుప గాలులఁ గాల్పించి వాటిపై నందఱం గొఱ్ఱతవెట్టించెనుగదా. ఇట్టులాపళ్ళనయనారి తిరువ్వూరు మహాత్త్వంబు నిలుపుట నీవువినలేదా? ఓరీ! జైనా! యింకను బెక్కుమాటలు పేలెదవా. అట్లయిన మఱియు వినుము.

నిడుమారునికథ

నిడుమారుఁడను నొకభూపతి తానేలు దేశంబునం దెక్కడను జైనులఁ గాపురముండనీక యందఱ శివభక్తులంజేసి తానును శివభక్తా గ్రేశరుండై రాజ్యమేలుచుఁ దన దేశంబునం దక్కఁ దదితర సీమ యంతయు జైనమత భూయిష్ఠమగుటకు మనంబెనరోసి యెట్లు వీరల నీశానుభక్తులం గావింతునని పరితపించుచున్నతఱి నాజ్ఞానసంబంధి యను పళ్ళనయనారు జైనులజయించి చోడభూవిభునిఁ దనకింకరునిఁ జేసికొని యనేకవేలమంది జైనుల నినుపత్రొట్టియల దింపించెనని విని తత్క్షణము జైనులనెల్ల రావించి వారలతో నిట్లనెను. ॥ఓవేదబాహ్యా నుకావలంబకులారా ! మీరింతకాలము మాప్రజలకు మీశాస్త్రమత

మును బోధించుచు సర్వజ్ఞనామధేయుండగు శర్వునివిడిచి సర్వజ్ఞశబ్దము జినునియందు వర్తింపఁజేయుచు బౌద్ధమతబోధసేయుచు సజ్ఞానమార్గంబునకు వారలంద్రిప్పుచు బాడుచేయుచున్నవారు మాజ్ఞానసంబంధియను శివభక్తుండు జైనులనేకవేలనుజయించి చోడరాజును దనవశముచేసుకొని జైనుల నినుపత్రొట్టియల దింపించినవాఁడని వినలేదా ? ఇక్కమీరు బ్రతుకుటకుండాశయుండెనేని మీరందఱుశివభక్తులైనుండుడు కాదేని మిమ్మినుపశూలంబులకుదియించెద" నని చేత నొక భీకరకరవాలంబుబట్టి యిట్టట్టుదిరుగు నతనింగాంచి జైను లీవిడుమారుడిక మనలను దప్పక లోహశూలంబులం గ్రుచ్చునుగాని విడువఁడు వీనిచేఁబట్టి ఘోరంపుఁజావు చచ్చుటకన్న శుభప్రదమగు శివమతమునంగీకరించుటమే" లనితలపోసి యందఱుశైవమార్గానుగులైరని నీవు వినలేదా ? యోజైనా ! యల్లచెల్లతిరువారూరను నొకనగరంబున జినమతోద్రేకంబువెచ్చు పెఱిగి యతిశయిల్లుచుండ నందొక్కవీరశైవుఁడు నమనంబియనువాఁడూరెల్ల ద్రిమ్మరియాచించి నేయిదెచ్చి యానేతితో దినమునకువేయివత్తులు ప్రత్యేకదీపంబులు శంభునకువెలిగించుచుండువాఁడు అట్టివానివ్రతభంగముసేయ సమకట్టి జనులింటింటికిబోయి యెల్లవారలకు "వీఁడు మీయిండ్లనేయిగొంపోయి యూరుబైట నున్నపాడుగుడిలో దీపములువెలిగింతుననుమిషచే నేలపాలుగావించుచున్నవాఁడు. తానునుభవింపఁడు మీకుంచఁడు. కాన వీనికింక నేయిబోయకు" డనిచాటిచెప్పిరి. అందుపై బ్రజలకువానపై నసూయజనించి మఱి యాజ్యంబుపూజ్యంబు పూజ్యంబని చెప్పఁదొడంగిరిగాని యొకరైననొకబొట్టయిన నీయరైరి. అతండు నేయిదొరకనందుకు దిగులొంది భగవంతునిగూర్చి యిట్లని ధ్యానించిమొఱవెట్టెను గట్టుపట్టిచేపట్టినయోదిట్టా ! నాదిట్టతనంబీవెఱుంగుదువు వేయింటికినొక్కదీపంబు దక్కువయైనను మఱిబ్రతుకను. దానికిబదులు నాశిరంబుఖండించి నా

తో వెలుంగుచున్న యనంతజ్యోతి నీకునమర్పించెదను. ఇందుకుదప్పితి నేని నీయుడుంగలాన" యనిసాష్టాంగంబుగా మ్రొక్కి వేడుకొన్న భక్తవత్సలుండగు భగవంతుండును వాని దృఢనిశ్చయం బెఱింగినవాండుగావున దయగలుబ్రత్యక్షుండై యాతనిజేయూతయిచ్చి లేవనెత్తి యోవెఱ్ఱివాండా! నీకేల యూరారాసుదరిగి నేతికై ముష్టియెత్తుట? నేనిచ్చగాడనై నను నాభక్తులను మహదైశ్వర్యసంపన్నులం జేసెదను. వారలబిచ్చమెత్త నీవు నీదీపంబులు దినమునివేయిగాదు లక్షలుగోట్లు వెలిగించినను తరగనితంపుగా నీరూపనాస్నానవాపియుండ నీకునేతికిగొఱుసనేమి? ఆసూపమందలినీరంతయు వేయిగన్న మఱింతస్ఫుటముగాను కాంతిమంతముగాను దీపంబును వెలిగించును. కనుక నేటినుంచి దినదినము స్నానవాపి యుదకంబులతో దీపంబుల వెలిగింపుము. నీకార్యంబు పూజ్యంబన్నవారల తొట్లులన్నియు నశించును" అని చెప్పి యంతర్ధానమునొందెను. అంతనాతడు సంతసమంది స్వామికిమనసా యనేకనమస్కారంబులుగావించి నిత్యమును కూసోనకంబున దీపంబులు వెలిగింప నవితొల్లిటికన్న పదున్నతంబగుకాంతితో వెలిగెను. మఱునాడుదయము గాని మస్థలునిద్ర మేల్కాంచి నంతలో నెవరిగోష్ఠంబున నున్న పశువులు వారి గోష్ఠంబులనే కాష్ఠప్రాయములై నిలిచినవినిలిచినట్లుగానె, పడినవి పండినట్లుగానె కిక్కురుమనక నొక్కసారిచచ్చినట్లు పడియుండెను. అదిచూచి పౌరులు తమదోషమును డాముగ్రహించి యాభక్తునిపాలికింబోయి తమ్ముక్షమింపుమని మించినభయభక్తి వినయంబులతోం బ్రార్థించిన నాతండును గనికరించి వారికూలప్రాణంబులు నొసంగి వానిసేగాక సచ్చిపడియున్న యెనుములు, మేకలు, గొఱ్ఱెలు, మొదలగుపాలపాడుపుల నన్నింటిం బ్రతికించి వారలకు శివదీక్షయిచ్చి మన్నించి యంపెను. ఇంటివా యోగిశ్రేష్ఠుదు తాత్మా! ఇంతయు నొక్కవిశేషమాలం,

## సాక్యతొండనికథ

చోళదేశంబున శాతమంగయను బౌద్ధజన సమృద్ధంబగు నొక పురంబు గలదు. అందు సాక్యతొండఁడను నొక శివభక్తుఁడు తన పూర్వజన్మఫలంబున నొక జినకుటుంబములోఁ బుట్టి భక్తి పెంపున జైనుల భయంబున శివుని-గూర్చి యిట్లని ధ్యానించెను. “ఓశివా భవా! భవానీపతీ! నీభక్తి నాకుఁ గలిగినందువలన లాభమేమి? బాహ్యభక్తుఁడనై నేమెలఁగిన మావారు నన్ను బ్రతుకనీరు. మనంబున నిండగు భక్తిగలిగి, యదిలేనివాఁడుగా నెట్లు మెలగునేర్తు? నీభక్తుఁడనగు నన్ను భక్తిలేని తలిదండ్రుల గర్భమున నేల ప్రసవింపఁ జేసితివి? దీన నీకుఁగల లాభమేమి? అయిన నిదియు నొక మేలుగానే యని నేననుకొనియెద. నీయందు గూఢభక్తి గలవాఁడనై పైకిభక్తి లేనివాఁడుగ నటించుచు నీయనుగ్రహము నాపై బ్రసరించి యీపాపాత్ములగు జైనులు నీవు నిర్మూలించి నీబాహ్యభక్తి లోకమున బహిరంగవ్యాప్తిం బొందుపర్యంతము నీశత్రునివలె నటించుచు బ్రతిదినమున నీత్రికాల శివపూజా సమయంబుల నిన్నుఁ బుష్పంబులఁ బూజించుటకు మాఱుగా నీపైని మూఁడేసిరాళ్ళు రువ్వుచు నిట్లు శిలాపుష్పంబుల నీపూజఁ గావించుచుండెద. అది మావారి కత్యంతామోదప్రదంబగు” నని నిశ్చయించుకొని యట్లు సేయుటకు నైదుదినంబులవఱకు ననువుగాక యాఱవదినంబునఁ దొలియైదుదినముల రాళ్ళు ముందురువ్వి పిమ్మట నాఱవదినమున విసరం దలఁచి రాళ్ళువెదకి యేఱితెచ్చి విసరివిసరి వేసరి “ఓభగవంతుఁడా! నీపై రాళ్ళువిసరి నాచేయి నొప్పి యెత్తినది గాని నీవుకదలమెదలక యట్లెయుంటివి నా రాళ్ళు నీకుఁదగుల లేదా? తగిలినను లక్ష్యపెట్టవైతివా? ఈసా నీవు తుళ్ళిపడి లేచి పాఱిపోవులాగున పెద్దఱాయి నీతలపైఁ బడవైతు”నని యొకచాపఱాయి యెత్తి విసరనుంకించు నవసరమున శివుఁడు

నిజరూపంబుతో మునిగణపతి సేవింతుండగుచు నెదుట నిలిచి తాయి యున్న చేయిపట్టినిలిపి "నీసాహసంబునకు మెచ్చితి. వైరమున బ్రాసన్నుండ నగునంత వేగము భక్తిని బ్రసన్నుండఁగాను నీకుఁ గోరిన పదవి నిచ్చెద నడుగు" మనెను. అంత నాసాయ్యతొండడు "స్వామీ ! నీయఖండ లింగాకారమును బ్రహ్మయు విష్ణుండును జూచి, పాదములు సూతునని బ్రహ్మ పాతాళంబు నడుగుపర్యంతము దిగిచూచి కానలేక మఱలివచ్చి చూచితినని యబద్ధమాడి భూలోకమునఁ బూజలేనివాఁ డయ్యె. శిరంబుఁ జూచెదనని పైకెగసిపోయిన విష్ణువు చూడలేక తిరిగి వచ్చి చూడలేదని నిజమొప్పుకొని నీకత్యంత భక్తుడై నీయనుగ్రహం బునకుఁ బాత్రుండయ్యె. అట్టినీలింగాకారము స్వరూపమిట్టిదని వేదం బులుద్ఘోషింప లేకపోయెను. సమస్తలోకములవారు వచ్చి దానిని దర్శించి చేతులుమోడ్చి యాతతభక్తిసమగ్రులై పూజాప మొదలు పెట్టిరి. సనకసనందనాది మహాయోగులైనం దమ యోగదృష్టిని గన నేరని నీయసమానచిన్మయులింగమూర్తి యాకారము స్పష్టముగా నేఁడు చర్మచక్షువులఁ గనఁ గలిగితిఁ నింతకన్న వేఱు వరమేమున్నది. దేవా! నీకు దూషణభూషణ తిరస్కారంబులు సమానంబులు ఇతర పదవులకన్న నాకిప్పుడున్న యీపదవియె చాలును ఈదేహము తోడ నే నీలింగమూర్తి సేవఁ గావించుచుం డెదంచెద. ఈసీపై నాచే యెత్త ఁడిన యీరాయియె యనేక పావురంబుల నాకారంబున నీగుడిచుట్టు హాళ్ళలో నివసించుచు దినదిన ప్రవర్ధమానంబై స్త్రీపురుష భేదంబు ?గు నాకృతులు గలిగి పార్వతియు నీవు నెట్లు జోడువిడువక యేక దేహులై కలసియుందురో యట్లనే మగపావురాయియు నాసతియు ?డుగట్టియు జంటవీడక సంతతిం గాంచుచు వృద్ధినొంది ప్రాతస్సా యం సంధ్యాసమయంబుల బైట సంచరించుచు నీకీర్తిం దేటపఱచు చుందురుగాత! నేను నీయథావిధి ప్రకటపూజలు సలుపుకొనుచుండెదను

ఈ నీమతంబునకు విరుద్ధమతాచారులును వేదబాహ్యులునగు జైను లంగడ తేర్పుము" అని యిట్లు ప్రార్థించిన భక్తునికోరికప్రకారము సర్వము నట్లనేచేసెను. జైనులు నచిరకాలంబునఁ దమలోఁ దామీ సాహ్యతొండఁడు దప్ప దక్కినవారందఱు మడిసిరి పిమ్మట శివభక్తి ప్రాబల్యము గలిగెను. ఇట్లు సాహ్యతొండఁడు శ్రుతిబాహ్యంబును నరకకూపాయనంబునగు మీమతావలంబకుల నిట్లునిర్మూలించుట నీవువినలేదు రాజైనా" యని చెప్పి మరలనిట్లనియె

## కోపూరి బ్రహ్మయ్యకథ

జైనాధమా! ఇంకను వినుము కోపూరిబ్రహ్మయ్యయను నొక శివభక్తుఁడు తానున్నపీటఁగల జైనులకుంబెనకుఁ నొకవాదము గలుఁగ హేతూదాహరణంబుల వారలను నచ్చఁజెప్పవారలు సమాధానముఁజెప్పలేక యోడి యాలుబిడ్డలుతోడను దాసదాసీజననామంతాదిబంధువులతోడను వెఱచి పఱపఁగడఁగి, యంతనొక వటమహాకుహంబుంగాంచి శివభక్తునింజేరి యీ వటవిటపివి వేళ్ళతోడను శాఖలతోడను నాకులు పిందెలు కాయలు ఎన్ని పండ్లతోడను దానినాశ్రయించి యుండు జీవకోటులతోడను భస్మమాత్రావశిష్టంబు నీవు సేతువా? మేమట్లొనరింప నీవు పునర్జీవితంబుగ నొనర్తువాయని యడుగ నతండు నాశంబునొందించుట మాపనిగాదు నశించినదానిని పునరుద్ధారణంబుఁగావించుటయె మాగురువాజ్ఞయన సంతసించుగూడి యతిప్రయాసంబున మంత్రంబుల నామఱ్ఱిచెట్టును దాని యందున్న జీవరాసులతో భస్మంబుగాజేప నాబ్రహ్మయ్యయు నింతభస్మంబు మూటగ్రంచి యాభస్మంబుపైజల్లి యా న్యగ్రోధమును సమగ్రముగ తొంటియాకారంబున నిలువజేసి పండునవ్వునవ్వుచున్న యాతనిసామర్థ్యంబునకు వారలోడిపాఱిపోయిరి గారివసతులనెల్ల బ్రహ్మయ్యతీసికొని శివభక్తులకిచ్చెను. పాఱిపోవుజైను

లఁబట్టి తెప్పించి యమపురికి అతిథులుగాఁ బంపెను. ఈకథవిన లేదురాజే
సా! మఱియువినుము

## దేవరదాసయ్య కథ

భొట్లచెఱువనునొక పురమున పురజనులుపదివేలమంది తన్ను సేవించుచుండ నొకజైనుఁడు దేశింగుబల్లహుఁడనురాజునకు సమ్మతి యేమనూర్కజైనాగ్రహారము లిప్పించుకొని మహాజైనభవనముకో జైనజనసంతృప్తిఁగావించుచుండెను ఆదేశింగుబల్లహుఁడను రాజుభార్య శ్రీసంగళదేవి దేవరదాసయ్యకు శిష్యురాలై శివదీక్షఁ బొంది తనభర్త జైనమతస్థుఁడై తనయాచారమ్ముల యజైనులపాలు సేయుచుండుట గని పెట్టి జైనులనోడించి భర్తను శివమతస్థునిఁగాఁ జేయుటకు ద్దేశించి నిజగురువగు దాసయ్యకు దయసేయుమని యొకకమ్మవ్రాసిపంపెను అతఁడును జైనులతో వాదించివారిని, రాజును శివమతస్థులుగాఁ జేయుటకుఁ దన శిష్యవర్గముతో భొట్లచెఱువుపురమునకు విచ్చేసెను అప్పటికి జైనగురువునొద్ద పురజనులిరువదివేవురుశిష్యులు పోగుపడి యతనిచే విధిములసేవించుచుండిరి. దాసయ్యవచ్చువృత్తాంతము జైనులువిని మార్గమధ్యమున నాతనికిన్నెయో యంత్రతంత్రములఁ గల్పించిరాకుండునటుల బ్రయత్నములుసేసిరిగాని దాసయ్య వానినన్నిటి సంహరణ చేసుకొనియుదకు పురమునఁ బ్రవేశించెను దేవియు నాతనిరాక విని ఎంతో నమస్కారములుచేసి యొకభవనమునసగానిచ్చి వారికిఁగావలయు సదుపాయముల జరుపుచుండెను ఇట్లు దాసయ్య తన శిష్యులతో చ్చియుండుట జైనగురువు రాజునకెఱింగించి యాతనిరాక తమ జైనులకుఁ బ్రతికూలము గనుక నాతనిఁ బురము వెలువరింపుమని రాజునకు విన్నవించెను. రాజును తనభార్య యొద్దకు నంతఃపురంబునకేగి ,,దేవీ! లోకము భార్యాభర్తలిరువురు నేకమార్గానుసారులైనవారి సంసారము యుక్తముగానుండునుగాని, భిన్నమతస్థులైనవారి కుటుంబస్థితి ,,యెద్దెండకు నెనుపోతు

నీవీలాగు నెద్దును నెనుబోతును బూన్చఁబడిన బండియొక్క దుర్గతిని బొందియుండుటకు నీవు నామతమవలంబించుట శ్రేయస్కరము. భార్యకు భర్తయే దైవము పతిదైవికయగు భార్యయె పరమపతివ్రత. నీ వట్టిదానవేని నామతమవలంబించి యీదాసయ్యను శిష్యసమేతముగా బంపివేయుము జైనులు విన్న నతనికిబ్రమాదము పుట్టును." అని చెప్పు భర్తవాక్యములు విని భార్య యిట్లనియె — దేవా! యీమతవిరుద్ధము మనయిద్దఱికిని నడుమవచ్చినదికాదు మనవివాహమునాఁటినుండియు నున్నదే. మీరునన్ను వివాహమాడునపుడు నామతమును నేను విడువక దానినే పరిపాలించునట్లును మీరంగీకరించి యట్టిపత్రము ను ముందు నాకొసఁగావించి పిమ్మట వివాహమైతిరి. శ్లో॥ గురుత్యాగీ భవేద్రోగీ మంత్రత్యాగే దరిద్రతా । గురుమంత్రపరిత్యాగే రౌరవం నరకం వ్రజేత్" అనియెడు సమస్తాగమశాస్త్ర సారసంగ్రహ మనునెడు మంత్రశాస్త్రప్రమాణమును మీరు వినలేదా? మీజైనమతమున గురూపదేశము మంత్రజపము దేవతారాధన గురుశుశ్రూషాదులు లేవు కాఁబోలు! మీరునాకు దైవస్వరూపులేగాని, యీవిషయములో మీయాజ్ఞనే శిరసావహించి గురుమంత్రములను విడిచి రౌరవనరకమును జూడఁజాలను. మీజైనమతమునకుఁ బుణ్యపాపములు లేవు. స్వర్గనరకములులేవు దేహత్యాగానంతర మాజీవుఁడేమగునో వారు స్థానాంతము అనంతరము సర్వముశూన్యమని మీసిద్ధాంతము శూన్యమగుటయు జీవుఁడును శూన్యుఁడవునని కాఁబోలు మీసిద్ధాంతము. అట్టిశూన్యసిద్ధాంతమతమును నేనవలంబింపలేను. ఇంతకు మీయాజ్ఞదాటుటకు నామనసొప్పకపోయినను మనవివాహమునాఁటి సమయప్రతిపాలనమువలన నాకాదోషములేదు. మీకు నేను సర్వదా దాసినే, మతమునువిడిచి మఱియొకమత మవలంబించుట మీజైనులకుదోషము లేదుగాని, మాశైవులకు మతత్యాగముకన్న మహాపాతక

ము లేదు. ఒకలాగైన మీకునునాకును ప్రత్యవాయముండదు. మాగు రువులు రాక నేను. మీజైనులవాదించి శైవమతసిద్ధాంతము సేయుటకే. మీగురువులుగెల్చిన మాగురువుగారిని వారిశిష్యులను మీమతము లోనికి జేర్చుకొందురు. మాగురువులుగెల్చిన మీరును మీగురువులును వారియితరశిష్యులును శివదీక్షపొంది శైవులుకావచ్చును. అట్లయినమీ కునునాకును మతత్యాగదోషము కలుగదు. ఎవరోడిన వారన్యమత మవలంబింపచ్చును. గనుక వారికివీరికి వాదము జరిపింపు" డని భర్తను బహువిధముల బ్రతిమాలి యట్టివాదమునకు జైనులనొప్పించి వారికి దాసయ్యగురువునకు వాదము సభాభవనమున స్థిరపఱిచెను.

ఇట్లుభయవాదులను మధ్యవర్తులను ప్రోగుచేసినసభయందుగూ ర్చి యుభయపక్షములవారును దమతమ శిష్యప్రశిష్యసమువాయము తో సింహాసనీనులైయుండ నిజజైనగురుసేవసేయుచు రాజును తనసై వగురు సేవసేయుచు రాజభార్యయు చెఱియొకసింహాసనము నలంకరింప జైనులకు దాసయ్యకు వాదమారంభమయ్యె అందుజైనులకు మత గ్రంథములు, శాస్త్రసిద్ధాంతములు లేవు వారికి తంత్రవాదము నింద్ర జాలాదిమాయలు ప్రధానములు వారిది ద్వైతమతమునుగా దద్వైత మతముగాదు. కేవలము శూన్యవాదమతము. ఇట్టిజైనులతో దాసయ్య వాదమునకుఁగడంగి తొలుతసగుణప్రకారమును పిమ్మటనిర్గుణప్రకార మును వెనుక వేదాంతసిద్ధాంతమును తదుపరి జీవాత్మ పరమాత్మ స్వరూప నిరూపణమును తదుపరి జీవదేవస్వరూపములును వారి వారి శాశ్వతాశాశ్వతత్వంబులును కట్టకడను శివమతప్రాధాన్యమును, లిం గస్వరూపమును లింగసంగతదేహపారిశుధ్యమును మున్నగు ననేకవిష యములు వారికిఁదెలుపుచుండ సభికులు తలలూఁచుచు వారుసేయుటో ధలకచ్చెరువందుచు జైనులమూకీభావముఁగని నవ్వుచుండిరి "దిక్కా లాద్యనవచ్ఛిన్నానంతచిన్మాత్ర మూర్తయె స్వానుభూత్యేకమానాయ

యువులను మనస్సులేక హృదయమును నంతరింద్రియమును నాలుగుభాగములుగ విభజించి మనోబుద్ధిచిత్తాహంకారములను నట్లుభాగములుగా విభజించి వానియధనమందా యవయవములనుంచి వానిచేత నాయా కర్మలఁజేయించుచు నిట్లుస్థూలదేహమును గావించి దానిచేకర్మలుచేయించుచుండును. పైని చెప్పిన మొదటిపదియు తరువాతిపది వాయువులను కడపటినాలుగును కలిసి యిరువదినాల్గును ప్రకృతులనఁబడును. ఆప్రకృతులే నిర్గుణబ్రహ్మముయొక్క స్వరూపము. ఈ యిరువదినాల్గు తత్త్వములేతపు సూక్ష్మాంశలచే నీస్థూలదేహమందంతర్వ్యాప్తమై లింగములేక లింగదేహమును పేరఁ బరఁగుచుండును. స్థూలదేహము నశించునుగాని యీసూక్ష్మదేహము నశింపదు. దానియొక్క బహిర్గమనమె మరణమనఁబడును. మరణించిన దేహముయొక్క లింగము దేహాంతరములనొంది తనస్థూలముతో దాఁజేసిన కర్మలఫలము ననుభవించుచుండును. ఈసూక్ష్మలింగదేహము భిన్నమగుటయే మోక్షము. అప్పుడే సూక్ష్మదేహమునున్న తేజస్సు మహాతేజస్సునైక్యమగును. సూక్ష్మదేహమున తేజోమయంబున నుండి పరబ్రహ్మము కర్మసాక్షియై సూక్ష్మదేహ లింగదేహము నధిష్ఠించి యుండి యందున్న పైయిరువదినాల్గు తత్వములను తనప్రకృతియే జీవుఁడను పేరఁ గావించు కర్మల నీక్షించుచు నాయాకర్మలఫలముల వానిచే ననుభవింపఁ జేయుచుండును. ఇట్లు సూక్ష్మరూపమున లింగదేహము నందుండి స్థూలదేహమునకు తానధిపతియై యుండుండును గనుక నీ లింగదేహమునే జీవుఁడందురు. ఆజీవుఁడు స్థూలదేహము నందుండుట వలన స్థూలదేహముగల మనదేహమె దేహియనబడును ఇట్టి దేహములనేకములు గలవు. ఇవి భూచర, ఖేచర, జలచరము లని మూడు విధములు. ఈమూడువిధములకు దేహములకు—"ఆహార నిద్రాభయ మైథునంచ సమానిచేష్టాని నరోమృగాణాం" అన్నటుల పైచర్య

